# శ్రద్ధాంజలి



జననం : 2-1-1910 మరణం : 15-6-1983

స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం, పునాదులై ఇళ్లులేచి, జనావళికి శుభంపూచి, శాంతి, శాంతి, కాంతి, శాంతి జగమంతా జయిస్తుంది. ఈ స్వప్నం నిజమవుతుంది ఈ స్వర్గం ఋజువవుతుంది' అని సమసమాజ శాంతి పాఠం పఠించిన అభ్యుదయాంధ్ర కవిత్వయుగకర్త శ్రీశ్రీ నిర్యాణానికి స్రవంతి శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.



సాహిత్య మాస పత్రిక

# 351

జూలై, 1983

వార్షిక చందా : పది రూపాయిలు

సంపుటి : 30, సంచిక : 4

విడిప్రతి : ఒక రూపాయి

సంపాదకులు :

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ఈ సంచికలో

సంపాదకీయం:

# ఇద్దరు సాహితీమూర్తుల అస్తమయం

ది. 15 జూన్ 1983. శ్రీ శ్రీ అస్తమించిన దినం.

ది. 1 జూలై 1983 డా॥ రావూరి వెంకట సత్యనారాయణరావు గారు అస్తమించిన దినం.

ఇరువురూ సాహితీమూర్తులే. ఇరువురూ తెలుగు సాహితీ జగత్తుకు వెలుగు ప్రసాదించినవారే.

అయితే శ్రీ శ్రీ మార్గంవేరు. రావూరి మార్గంవేరు.

ఇప్పటికి ఏభై ఏళ్ళుగా తెలుగు కవిత్వాన్ని అభ్యుదయ,విప్లవ పథంవైపు నడిపించిన యుగకర్త శ్రీ శ్రీ.

ఇప్పటికి నలభై ఏళ్ళుగాముట్నూరి కృష్ణారావుగారివంటి సాహితీమూర్తుల సాన్నిధ్యంలో వుండి, ఎవ్వరినీ బాధించకుండగ. తనరచనలద్వారా అందరినీ నవ్విస్తూ కవ్విస్తూ, సర్వుల హృదయాలను అలరిస్తూ, పన్నీటి జల్లులు కురిపిస్తూ నింపాదిగా తన పథానముందుకు సాగిన సాహితీ తపస్వి డా॥ రావూరి.

యముని మహిషపు లోహఘంటలను ఖణేల్ మనిపించారు శ్రీ శ్రీ. మరో ప్రపంచానికి బాట వేశారు. కొత్తగొంతులకు శ్రీశ్రీ కలిగించినంత ప్రేరణ మరెవ్వరివల్ల కలగలేదంటే అతిశయోక్తికాదు. శ్రీశ్రీ రచించిన మహాప్రస్థానమందలి 41 ఖండికలు 41 కావ్యాలుగా మహత్తరమైన స్థానం సంపాదించుకున్నాయి.

డా॥ రావూరివెంకట సత్యనారాయణరావుగారి రచనలు సత్యాహింసలకు ప్రతిబింబాలు. ప్రజల హృదయాలను కదిలించేందుకు సున్నితమైన హాస్యాన్ని సాధనంగా ఉపయోగించుకొన్నారు రావూరి.

శ్రీశ్రీ మహాజలపాతమైతే రావూరి చల్లని నిర్మలమైన సెలయేరు.

ఇట్టి సాహితీమూర్తు లిద్దరిని తెలుగు సాహితీ జగత్తు జూన్ జూలై మాసాలలో పోగొట్టుకొన్నది.

పై ఇద్దరు సాహితీమూర్తుల ఆత్మలకు శాంతి లభించుగాక.

# అఖిలభారత హిందీప్రచార మహాసభలు

నవంబరు 1983లోగాని లేక జనవరి 1984 గాని అఖిలభారత హిందీ ప్రచారమహాసభలు హైదరాబాదులో దక్షిణభారత హిందీప్రచారసభ, ఆంధ్ర ఆధ్వర్యాన జరుపుటకు నిర్ణయం జరిగినది. శ్రీలోకకర్సీలాల్ కపాడియా గారి అధ్యక్షతన ఆహ్వానసంఘం ఏర్పాటు చేయనైనది. అఖిలభారత స్థాయిలో హిందీ ప్రచారరంగంలో పనిచేస్తున్న 2000 మంది ప్రతినిధుల్ని ఆహ్వానించుటకు నిర్ణయం జరిగినది. ఆంధ్రప్రదేశ్‌లోనేగాక యావద్భారతావని యందు ఈనాడు జరుగుతున్న హిందీ ప్రచారాన్ని గురించి, అందుకు సంబంధించిన సమస్యల్ని గురించి చర్చించి అవసరమైన సూచనలు చేసేందుకు మహాసభలు ఎంతో దోహదం చేస్తాయి. మహాసభల్ని విజయవంతం చేసేందుకు ఆంధ్రప్రదేశ్ యందలి వేలాది హిందీపండితులు, ప్రచారకులు సహకరిస్తారని ఆశిస్తున్నాము.

# దక్షిణభారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర స్వర్ణజయంతి

1986లో దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్రశాఖ స్వర్ణ జయంతి జరుపుటకు నిర్ణయం గైకొనబడినది. ఆంధ్రశాఖ కార్యనిర్వాహకవర్గ సమావేశంలో స్వర్ణజయంతి కార్యక్రమాలు అంగీకరించబడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 5000 మంది హిందీప్రచారకులు సభ స్వర్ణజయంతి కార్యక్రమాలను విజయవంతం కావించుటకు సంపూర్ణంగా సహకరిస్తారని విశ్వసిస్తున్నాము.

—o—

# శిలా దర్శనము

వేముగంటి నరసింహాచార్యులు

ప్రస్తరములు శిల్పకళా
ప్రస్తరములు, సుగుణకలిత రాజన్యకథా
విస్తరములు, భాసురరూ
పాస్తరములు లోకహృదయహర్షస్థిరముల్

భోగినులై, నాట్యాంచిత
నాగినులై, మందహాస నవనవశోభా
రాగిణులై శిలలు కళా
శ్రీగరిమను చూపుటెంతొ చిత్రముకాదా?

ఒక బండ గుండెలో ఉప్పొంగుచుండును
కరుణామృతస్నిగ్ధ కల్పనమ్ము
ఒక శిలాగళములో ప్రకటితమ్మగుచుండు
సప్తస్వరావళీసామగీతి
ఒక రాతి నాతిలో ఒదవుచుండు మనోజ్ఞ
శృంగారభంగీతరంగకలన
ఒక ఉపలమ్ములో ఉపలాలనమునొందు
జనని కన్పాపగా చంటిపాప

లలిత పాషాణమొకటి సంకలితభావ
కలిత భాషాణమై హృదాకర్షకముగ
వెలయుచుండుట గని జనవితతి శిల్ప
విరచితాకృతి నొందుట వింతయేమి?

భవ్యదైవత వైభవప్రాభవమ్ములు
దీపించు ఉన్నత గోపురములు
దర్శించువారి కుత్సవము సంధానించు

మహనీయ కమనీయ మంటపములు
అద్దమ్ములనుబోలి ముద్దులుగారు
నిద్దానిగ్గు సుందర స్తంభములును
భక్తావళిపయి కృపావిలోకనములు
వెలయించు దేవతా విగ్రహములు

కనుల పండువు చేయు తోరణ్ణ చయమ్ము
అమరి బాసిల్లునట్టి దేవాలయముల
నిర్మితికి కారణమ్మోచు నివ్వటిల్లు
శిలల సౌభాగ్యగరిమ భజింతునెపుడు

చెలువుగా గిరిరాజు శిఖర శిరంబున
డంబుమీరగ కిరీటంబు వెట్టి
అనువుగా కొండరాయని చెవిదోయికి
కుండల యుగళము గుస్తరించి
మురువుగా ధారుణీధర రమణాగ్రణి
ముంజేతి కంకణమ్ములను తొడిగి
తిరముగా పర్వతాధిపుని పాదమ్ముల
గండ పెండెరమును గండరించి

శైలవిభుమేన రవణముల్ సంతరించి
గిరివర సమాజమునకు బంధురత చెలగ
వివిధ రీతుల కైసేసి వెలయుచున్న
ఉపల సఫలార్థకృత్యము నుగ్గడింతు

మధుమాస వేళలో మలయాంకురానిల
మ్ములు సోకినప్పుడు తలకి తలకి
గ్రీష్మాతపమ్ముడికించిన వేళలో
వేడి నిట్టూర్పులు విడిచి విడిచి
తొలకరి నీలి మబ్బుల చాలు కురిపించు
వాన జల్లులలోన నానినాని
శారదేందూదయ సమయాన జిలిబిలి
వెన్నెల పన్నీట వెలసి వెలసి

ఎసగు హేమంత సీమంత మివతళించు
వేళ మంచు ముత్యాలలో తేలితేలి
శిశిరవేళ ఆకులపాటు చెందిచెంది
సాగిపోవు పాషాణ సంచయము బ్రతుకు

తీయతీయగ ఊదుమాయని కన్నయ్య
మోవిపై పిల్లనగ్రోవి నిలిపి
అడరి తాండవమాడు మాయని ముక్కంటి
పదముల గజ్జెలు పరిఢవించి
దుష్టుల శిక్షింప దొరకొనుమని రాము
కేల కోదండము గీలుకొలిపి
గల్లు గల్లను మ్రోతగా రమ్మనుచు నంది
మెడలోన గంటలు మేళవించి

అప్సరోంగనా రుచిరనాట్యక్రియావి
శేష కేళికి రంగము సిద్ధపరచి
స్నిగ్ధముగ్ధా కృతులతోడ చెలువ మొల్కు
రాలు వెలగల మేతివరాలుగావె?

గాలికి కదలాడు పోలికి మేలుగా
రాలు పూతౌటబ్బురమ్మటంచు
లావణ్య మొల్కు లీలన్ శిలావళి కళా
విభవమ్ము చూపుట వింత యనుచు
మనసు నాకర్షించు ననువున గ్రావమ్ము
జీవమ్ము తొలకుటచ్చెరువటంచు
దాన శాసనముల ప్రాణమ్ములకు బండ
అండగా నుండుట అరుదటంచు

రాయి ఒకటి సౌందర్యాబ్ధి రామ రామ
గా నగుట కడు ఆశ్చర్యకరమటంచు
కఠిన పాషాణ పాళి సాగర తరంగ
శ్రేణిలో తేలియాడుట చెప్పరాని
చిత్ర మనుచు జనమ్ములు చెంగలించి
కరగిపోదురు నివ్వెర కడలిలోన

కండలు కరగించి కష్టించు శ్రామిక
కోటికి జీవిక గూర్చు నొకట
మండుటెండలయందు మలసి తట్టలు మోయు
పేదరాలికి బువ్వ బెట్టు నొకట
ధారగా చెమ్మట లూర మేడలు గట్టు
కూలివానికి డబ్బు గొలుచు నొకట
చేయి కాయలుగాసి చితుక సమ్మెట గొట్టు
కార్మికునకు పొట్ట గడుపు నొకట
ఉలిమొన మలంచి గిలిగింత గొలిపి నిలిపి
ముగ్ధమసృణ కళారూపములు రచించు
శిల్పి వరునకు సిరి విరజిమ్ము నొకట
రాలు [illegible] వరాలు గావె?

నేల తొయ్యలి తల్లివోలె కౌగిట జేర్చి
లీలగా ప్రేమ్మిలాలించుచుండ
తరువరమ్ము అనుగు తండ్రి విధమ్మున
చల్లని నీడ నొసంగుచుండ
వల్లీమతల్లులు చెల్లెండ్ర తీరున
విరుల వానలు కురిపించుచుండ
వాహినీ తతి చుట్టపక్కాల రీతిని
కూరిమి వెల్లువ క్రుమ్మరింప
వరలి తొలిసంజ బంగరువన్నె దిద్ద
ముసలి మలిసంజ కుంకుమపూత పూయ
కారు చీకటి కనులకు కాటుక నిడ
శిలలు మొల్లముగా నుల్లసిల్లుచుండు

కమనీయ కల్పనా కల్పమ్ముగా తెల్గు
శిల్పమ్మునకు నవశ్రీ ఘటించి
దీర్ఘాయురుజ్జీవదీప్తముగా తెల్గు
చరితమున కమృత చషకమిచ్చి

హృద్యాన పద్యగరిమ తెల్గు పద్యమ్ము
సురుచిర మూర్తికి పురుడువోసి
సౌభాగ్య సౌరభ్య సౌకర్యముగ తెల్గు
సంస్కృతి విభవమ్ము చాటిచెప్పి

తెలుగు కళలకు క్రొంగొత్త వెలుగు గూర్చి
తెలుగు కోవెలకు సౌరు
తెలుగు పలుకు వెలందికి పొలుపు లూర్చి
అలరు పాషాణములకు జోహారు సేతు

బుద్ధదేవుని కారుణ్యమూర్తి దాల్చి
కాళికాదేవి భీకరాకార మూని
గణపతి స్వామి చిత్ర విగ్రహము నెనసి
ఎంతో వింతైన రూపము లెతు శిలలు

తెలుగు పండితులు
సిద్ధిపేట

# ఒక పరంపరాయుధం

సుధామ

ఎర్రటినేల సరసన
చుట్టుపక్కల ముప్ఫయ్‌రెండు తెల్లటి ఎనామిల్ గుహలు
ఆవలగా అంతులేని అగాధాల లోయ గొంతు
వీటన్నిటికీ కనిపించనిచోట హృదయారణ్యం
మరింకింత ఎత్తున అనుశాసన పర్వపు సంకీర్ణాధికార నగరం మేధ.

మన తొలినివాసం అడివే
అక్కడే మొదట నిప్పును కనుక్కున్నది
అర్థంకాని జీవితపు ఆరాటాల పోరాటాల్లోంచి
ఎన్నో ఏమిటో చెప్పలేని వివిధ సంకేతాల గుబురుల్లోంచి
సంఘర్షించిన భావాల్లోంచి
ఓ అర్ధరాత్రి హఠాత్తుగా లోయలోంచి మొట్టమొదటి మన ఆయుధం
దూసుకొచ్చింది.

ఒరలోంచి లాగిన క్షణంలోనే పదునును ఝుళిపించే ఆయుధం,
అనుకున్నప్పుడు అనుకున్నచోట అనుకున్నదానికల్లా పనికొచ్చే పనిముట్టు
భావాన్ని బట్టి రూపాన్ని మార్చుకునే శక్తి ఆయుధంలా ఇది-
పరంపరాగతంగా ఎన్ని హొయలుతో దూసుకుపోతోందో.

కానీ అదేం చిత్రమో'
అరణ్యంనుంచి నగరానికి ప్రవేశించిన మాత్రాన
దీనికి ముసుగులు, చిత్రికలు, నాగరీకం రంగులు
అందంగా హొయలు వయ్యారాలు నేర్పింది కానీ
ఎంత మారిపోతోంది! ఎంత బిరుసెక్కుతోంది!
నగరాధికారానికి ఒదిగి-కాకాలకి, బాకాలకి, మొగమాటాలకి,
పడమటి వన్నెల ప్రభావాలకి, ఎంత చిత్రంగా ఈ ఆయుధం
సహజమైన అదను పోగొట్టుకుంటూ,

ప్లాస్టిక్ నాణ్యతతో, సింథటిక్ పదునుతో,
గోయనిండా గిరికీలు తిరుగుతుంది! పల్టీలు కొడుతుంది!

దంతపు గుహల గాలుల్లోంచి లేచి, ఎర్రటి నేల సరసన కవాతు చేసే
పదనైనిక సమూహాలతో వచ్చే ఇది,
అరణ్యాన్ని మరిచి-
నగరం శాసనాలకు నియంతలాలనలకు లోబడిపోతూ

శిథిలాలయ నిఘంటువుల రుద్రభూములకు మంచుపల్లకి యాత్ర చేస్తుందా?
ఇవాళ నగరంలో దీన్ని నా కోపాన్ని మోయమంటే,
చిట్లిన నా నుదుటిని సంకేతించమంటే, నిరసనల్ని నినదించమంటే,
ఉన్న ద్వేషాన్ని వెళ్ళగక్కి;
ఉత్తాలమైన ఆశయాన్ని, లక్ష్యాన్ని, గమ్యాన్ని వెదజల్లి
ఆచరణా పథాన విజయ విప్లవాక్షరాలను ఉచ్చరించమంటే,
దంతపు గుహల గాలుల్ని ప్రచండ మారుతంచేసి
తప్తదగ్ధమౌతున్న హృదయారణ్యాన్ని ఉన్నదున్నట్లుగా
ప్రతిధ్వనించకుండా—

తన కవాతు నడకలో-మేధాధికారపు శాసన ప్రకటనలకు,
మానిఫెస్టోలకు, నియమావళులకు, జి. ఓ లకు ఎదురుచూస్తూ-
ప్రజల గుండెలకు బదులు ఏవేవో సిద్ధాంత గ్రంథాల పుటలు తిరగేస్తూ-
పార్టీల డిక్షనరీలకు, వేర్వేరు జార్గాన్‌కు, మౌత్ ఆర్గాన్‌కు నిలబడిపోయి
ఆపై సావకాశంగా సోఫాలో జార్లబడి,
టీ కప్పు పొగలకి, సిగరెట్టు రింగులకి, సీసాద్రవాల పొంగులకి కాంక్షిస్తూ-
అరణ్యాలురణాలుకాక, నాగరికపు సుఖవ్రణాలు ప్రేరణలు కావాలంటుందా?

ఏది దీని ఆదిమస్థితి?
ఏమైపోయింది ఆ సహజ ప్రతిస్పందనల వీరాకృతి?
తుప్పుపడుతోందా ఆయుధానికి! పదును చెడిందా దీనికీ!
లేక ఉపయోగం తెలియని ప్రతివాడి వాచాలతకు అలంకారంగా,
పావురం ముక్కున బ్లేడుముక్కలా నిలబడిందా?
ఏమైపోతోంది ఆ ఆదిమ పదును?
నిప్పుపుట్టిన మొదటిక్షణాల తీవ్రత!

దంతపు గుహలమీద టూత్ పేస్టులు పులిమి,
గొంతులోయల్లో ద్రాక్షాసారాలు నింపి,
నేలనాలుకమీద ఎరల పంచదార బిళ్ళలువొంపి.
అరణ్య దారుల్ని మూసేసి,
చీకటిగుంట మేథోనగరంలో- అర్ధనగ్న క్యాబరేలు, ఉస్కోల డిస్కోలుతెరిచి.
ముఖమల్ పెట్టెలో పెట్టిన ఆయుధంగా, ఏలికల నగిషీలనజరానాగా,
ఎవరుదీన్ని నిద్రపుచ్చుతున్నారు మ్యూజియంలోలా?
కవి సూర్యుడా! ఉదయించు
నీ కిరణఖడ్గంగా ఝళిపించుదీన్ని
ఆదిమానవుడి గుహలమాటునుంచే, అప్పటిలోయల్లోంచి
ఎంత సహజంగా చీకటిని ఛేదించిందో నీకు గుర్తులేదూ!
హృదయారణ్యంలో భవతీవ్రతకు పరస్పరం జరిగిన సంఘర్షణలో
ఎలా అంగలువేస్తూ లేచి వచ్చిందో
ఆరోజు ఎంతసహజంగా నరాలు తెగేలా కేకలుపెట్టి
క్రియకు సారథ్యం వహించిందో నీకు గుర్తులేదూ
మనసా వాచాకర్మణా ఒకటిగా ఎలా పుట్టిపెరిగి లయించిందో
జయించిందో నీకు గుర్తులేదూ!
ఇది అదే ఆయుధంరా నాన్నా;
సందేహించకు- దీనికి ప్రాణప్రతిష్టచెయ్యి
నీ అవయవాల్లో ఒకటైపోయినట్లుగా అతిసహజంగా దీన్ని మొయ్యి
హృదయారణ్యంలోంచి లేవనియ్యి
మేథోనగరం జంబూక శాసనాలకు లొంగక
ఆయుధానినే- మేధను సహజంగా విచక్షించగల పదునుగా
రగులనియ్యి
దురవస్థను నిలువునా కూలనియ్యి
నీ అవయవాల్లో ఒకటైపోయినట్లుగా
అతి సహజంగా దీన్ని మొయ్యి
భాషను నీ సంపూర్ణభావ వినిమయ సాధనాయుధం కానియ్యి

ఎం. ఎస్. 86, మలక్ పేట కాలనీ,
హైదరాబాద్-500 036.

# అనుభవం పండు

—మానేపల్లి సత్యనారాయణ

అనుభవం మనిషిని పిరికివాణ్ణి చెయ్యకూడదు
అనుభవం మనిషిని అయః పిండంలా చెయ్యాలి
వయసు మనిషిని వంగిపోయేలా చెయ్యకూడదు.
వయసు, వింటిబద్దలా, వంగినా తిరిగి మరింత
బలంతో ఎదురు నిలిచేలా చెయ్యాలి మనిషిని.
పాండిత్యం మనిషిలో పనికి మాలిన పొగరు పెంచకూడదు.
పాండిత్యం పరిపూర్ణ జ్ఞానాన్నిచ్చి పలుకు పండించాలి.
సన్మానాలు-మనిషిని మలినపరచకూడదు. సంకుచితం చెయ్యకూడదు.
సన్మానాలు మనిషిని సువిశాలం చెయ్యాలి
సమ్యగ్ దృష్టిని పెంచాలి.
కష్టాలు మనిషిని క్రుంగ దియ్యకూడదు.
కష్టాలు మనిషిని కాయదేర్చాలి, కణకణలాడే నిప్పును రాజెయ్యాలి.
ఇతర భాషలు మాతృభాషపై మనసు విరచరాదు
మమకారం పెంచాలి, మమేకం అనిపించాలి,
విదేశాలు స్వదేశంపై చిన్న చూపు పెంచకూడదు.
పెద్ద చూపునూ, పెద్దరికపు చూపునూ ఇవ్వాలి.
అచలాలవంటి భౌతికవాదులు, వయసుమళ్ళి చలించిపోతుంటారు.
అనుభవం పండిన పండు - పురిపండు -
పురెక్కిన పండు - పురివిప్పినపండు - పురివిప్పిన పంజా
పురిపండా అప్పలస్వామిగారూ
చెయ్యవలసినవే అన్నీ చేసిన పెద్దనగారూ
చితిమీదకూడా చిరునవ్విన చిదానందులూ
మాట్లాడే భాషకు మాన్యతరావాలనీ,
మహాకావ్యాలూ, మహాకవులూ
అక్కణ్ణించే ఆవిర్భవించాలనీ ఆశయించారు.
ఆంధ్ర విద్యాలయాలుకూడా అక్కణ్ణించే
ప్రారంభించి ప్రస్థానించాలని ఆకాంక్షించారు.

మీ ఆశయం నెరవేరక తప్పదు.
అంతవరకూ - మీ సాహిత్యం, ప్రభావం, ఆశయదీక్ష
ఇచ్చిన స్ఫూర్తి మాలో ఆరదుగాక ఆరదు.
ఇది ఆంధ్రుల అత్యవసర రక్ష.
[రచన : 18-12-82 కాలం పులిపంజాతో కొట్టిన రాత్రి)

లెక్చరర్, కోటవీధి
చోడవరం (విశాఖజిల్లా)-531 036

# యువతరం

-డి. ఉషా లావణ్య

మేం ఈ తరం వాళ్ళం
ఏకలవ్యుని సంతతి వాళ్ళం!
గురు: అనుగన్తవ్య:- ఒప్పుకుంటాం.
కాని,
గుండెల్లో అలజడి గొంతు నులిమినా
మౌన కుటీరంలో బందీ అయిన మూగ వేదన
హాహాకారాలు చేసినా
మౌనంగా భరిస్తూ బ్రతకడం
'విధి' అనుకోం.
విద్యకు విలువ యివ్వని సమాజం
మంచితనానికి వెలకడుతుంటే-
ఆ అయోమయావస్థలో
జీవితపు విలువలు దెబ్బతింటుంటే-
ఎదకు తగిలే ఎదురు దెబ్బకు
ఏడుస్తూ కూర్చోం,
అర్థంలేని ఆవేశాలకు
జీవితాలను బలిచేయం!
ఎందుకంటే-
మేం ఈ తరం వాళ్ళం,
ఏకలవ్యుని సంతతి వాళ్ళం!
స్వయం కృషితో
సత్యాన్ని అన్వేషిస్తాం
వ్యష్టి సమష్టి సమన్వయానికి
బాటలు వేస్తాం.
బాణ సంధానం చేస్తాం
లక్ష్యాన్ని సాధిస్తాం.
కాని,
దక్షిణ మాత్రం యివ్వం

లెక్చరర్, పి జి. కాంప్లెక్సు,
ద. భా. హిం. ప్ర. సభ,
హైదరాబాదాద్.

## నమ్మకం

-కె. అంజయ్య

ఆకాశం భోరున ఏడుస్తుంటే
పై కప్పు రంధ్రాల్లోంచి
సమస్యలు రాలుతాయి
సూర్యుడు తీవ్రంగా ఏడుస్తుంటే
తలలు మాడి
బుర్రలు పనిచేయక చస్తాం.
సముద్రం వలవలా ఏడుస్తూ
తన బాధకు మన కౌగిలింతలో
ఉపశమనం పొందాలనుకుంటే
గురికి బెత్తెడు దూరంలో
చావు నృత్యం తిలకిస్తాం.
అందుకే
కన్నీటి చూరుకింద
చావు నృత్యం తిలకిస్తాం.
అందుకే
కన్నీటి చూరుకింద
కాపుర ముండలేను
దుఃఖము దుర్వ్యాధీ
దేన్నీ నమ్మలేను.

ఇ. నం. 5-2-85
పారిపల్లి స్ట్రీట్
సిద్ధిపేట-502 103

## వికటకవి

-డా. తంగిరాల

గురజాడ అకవి
రాయప్రోలు సుకవి
తుమ్మల కాంగ్రెస్ కవి
విశ్వనాథ ఆరెస్సెస్ కవి
కృష్ణశాస్త్రి బ్రహ్మ సమాజకవి
శ్రీశ్రీ (కమ్యూనిస్టు) సమసమాజ కవి
తిలక్ కుందుర్తులో సోషలిస్టులు
దిగంబరులు అనార్కిస్టులు
విరసంవారు నక్సలైట్లు
అరసంవారు అపర్చ్యూనిస్టు
దాశరథి(నల్ల దొరల) ఆస్థానకవి
సినారె సినీమా కవి
శేషేంద్ర జనతా కవి
(డ్యూయల్ మెంబర్‌షిప్ చర్చనీయాంశం)
'ఛఛ నేను ఏదీకాదు' అన్నకవి
నిజంగా వికటకవి !

డా॥ టి. వి. సుబ్బారావు
అసోసియేట్ ప్రొఫెసర్ & హెడ్
తెలుగుశాఖ
బెంగుళూరు యూనివర్సిటీ
బెంగుళూరు-560 050

# "కథానిక" లక్షణ నిర్దేశం

—వి. సిమ్మన్న, ఎం.ఏ.డి.వి.యస్.

ఆధునిక కల్పనా సాహిత్య (Fiction) ప్రక్రియ లన్నిటిలోను, కథానిక ప్రముఖ స్థానాన్ని అలంక రించింది. కథానికనే చిన్నకథ అనీ, కథ అనీ (Short story) నేడు తెలుగులో వ్యవహారం "కావ్యేషు నాటకం రమ్యం" అన్నారు. సంస్కృతా లంకారికులు. కాని కాలాన్నిబట్టి రుచులు మారుతూ వుంటాయి. ప్రస్తుత సమకాలీన సాహితీ ప్రక్రియ లను చూస్తే "కావ్యేషు కథా రమ్యం" అని అనక తప్పదు. అసలు సాహిత్య జగత్తులో ఈ యుగాన్ని మనం కథానికా యుగమని పిలువవచ్చు. ఈ కథానిక పాశ్చాత్యుల సాంప్రదాయం. పాశ్చాత్య రచయితల ప్రభావంవల్ల ఇతర భాషల మాదిరిగానే భారతదేశం లోనికి ప్రవేశించిన ఆధునిక వచన సాహిత్య ప్రక్రి యలలో 'కథానిక' ఒకటి.

"కథానిక రచన తొట్టతొలుతగా అమెరికాలో ప్రారంభమైనది. పాశ్చాత్య దేశాలలో చిన్న కథలు వ్రాసి ప్రసిద్ధికెక్కిన వాళ్ల ఎడ్గార్ ఎలెన్‌పో, సోమర్ సెట్‌మామ్, గయ్‌డీ మొపాసా, ఆంటిన్ ఛెకోవ్, స్టీవెన్‌సన్, సారోయన్, జాక్‌లండన్, జోలా, నదేనియల్ హాథోరన్, స్టైన్‌బక్, హాబర్డ్, మపసా, ఓ హెన్రీ మొదలైన ఎంతోమంది రచయితలున్నారు.

భారతీయ భాషా సాహిత్యాల్లో ముఖ్యముగా తెలుగు సాహిత్యంలో కథానికలు లేవా? అన్న ప్రశ్న మన కుదయించవచ్చు. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కథలు న్నట్లు స్పష్టంగా చెప్పలేము. కథలు గ్రంధం కాక పోయినా వాగ్రూపంలో వుండి వుండొచ్చు రానురాను ఆంధ్ర సాహిత్యంలో కథలు కావ్యాలలోను, ద్విపదల లోను కనబడుచున్నాయి. కాని కేవలము వచన రచనలో కథలున్నట్లు కనబడవు.

ప్రాచీనాంధ్ర వాఙ్మయమునందలి కథా సాహిత్య ములో కేతన (క్రీ॥ శ॥ 1255) దశకుమార చరిత్ర ప్రథమ గద్యపదాత్మకమైన కథా రచన. అనంతా మాత్యుని భోజరాజీయము, జక్కన విక్రమార్క చరిత్ర, వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమార చరిత్ర కొఱవి గోపరాజు ద్వాత్రింశత్సాలభంజికల కథలు, కదిరీపతి శుక సప్తతి, నారాయణకవి హంస వింశతి, తురగా వెంకంరాజు మర్యాద రామచరిత్రలందు ప్రాచీ నాంధ్ర దేశమున విశేష ప్రాచుర్యము వహించిన కథలు కన్పించుచున్నవి. ఈ కథా గ్రంథములేకాక పేదరాశి పెద్దమ్మ కథలు, కాశీమజిలీల కథలు, పిట్ట కథలు వంటివికూడా యుండెడివి.

ఆధునిక కాలమునందు 1850 ప్రాంతమునుండి కథా సాహిత్యము ప్రారంభమైనది. పరవస్తు చిన్నయ సూరి, కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతి వేంకటరత్నం పంతులు, వేదం వేంకటరాయశాస్త్రి ప్రభృతులు సంస్కృత సాహిత్యమునుండి ఎన్నియో కథలను అనువదించియు, అనుకరించియు రచించిరి. వేదం వెంకటరాంశాస్త్రిగారు భోజకాళిదాసు కథలు, బేతాళ పంచవింశతి కథా సరిత్సాగరము అనుకథల సంపుటములను ప్రకటించిరి. ఇవి సంస్కృతమునుండి యనువదింపబడినవి.

సంపూర్ణ ఆధునిక కథానిక లక్షణాలు గలిగి యున్న రచన 1910 నుండే ప్రారంభమైనదని చెప్ప వచ్చు-తెలుగు సాహిత్యములో కథానికకు శ్రీకారము చుట్టినవారు శ్రీ గురజాడ అప్పారావుగారు. అప్పారావు గారి తొలికథపేరు 'దిద్దుబాటు'.ఇది"ఆంధ్రభారతి"అనే పత్రిక ఫిబ్రవరి 1910 సంచికలో మొదటిసారి అచ్చ యింది. అప్పారావుగారు మొదట ఈ కథను గ్రాంధి కంలో వ్రాసి, తరువాత వ్యావహారికంలోనికిమార్చారు. తెలుగు కథానికా ప్రక్రియ విషయంలో భిన్నాభి ప్రాయాలున్నప్పటికి గురజాడ అప్పారావే ఆద్యులని చెప్పుకోవచ్చు

మన ప్రాచీన సంస్కృత వాఙ్మయంలో కథానిక లుండేవని చెప్పడానికి లక్ష్య భూతమైన ఆధారాలు కనిపించలేదు. కాని, అగ్ని పురాణంలోను, ధ్వన్యా లోకంలోను, కథానికను ఒక గద్యకావ్య ప్రభేదంగా పేర్కొనుచు కథానికను లక్షణ పూర్వక యుగమని చెప్పిరి.

"ఆఖ్యాయికా. కథా, ఖండక, పరికథా, తథా
కథానికేతియన్యంతే గద్యకావ్యంచ పంచధా॥
(అగ్నిపు)

కథానికను ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా గుర్తించి, ప్రపంచంలో మొట్టమొదటిసారిగా లక్షణ నిర్దేశం చేసిన ప్రతిష్ఠ 'అగ్ని పురాణా'నికీ దక్కు తుంది. అందులో కథానికా ప్రక్రియను ఇలా నిర్వ చించారు.

"భయానకం సుఖాపరం గర్భేచ కరుణోపరసః
అద్భుతోఽంతే సుక్లప్తార్థానోదాత్తా సా కథానికా॥
(అధ్యాయం-337)

ఆదిలో భయానకం, మధ్యలో కరుణం, అంతంలో అద్భుతం అన్న మూడు రసాలుంటూ, క్లుప్తంగా అనుదాత్తంగా చేసిన రచన కథానిక అవుతుంద న్నాడు.

ప్రాచీనులు చెప్పిన లక్షణాలను ఆధారంగా చేసు కొని ఆధునిక యుగంలో తెలుగులో "చిన్నకథ"కు "కథానిక"అని పేరుపెట్టి ప్రచారంలోకి తెచ్చినవారు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు.

కథానికా రచన గురించి ప్రముఖ ప్రాచ్య పాశ్చా త్యులు వెల్లడించిన నిర్వచన ప్రాయమైన అభిప్రాయా లను క్రింద వివరిస్తున్నాను.

కథకు ఏఏ విధాలుగా మనం నిర్వచిస్తామో, ఆయా నిర్వచనాలన్నీ కథానికకుకూడా వర్తిస్తాయి అన్న మాట మనము గుర్తుంచుకోవాలి.

### ప్రాచ్యులు :

"కథానిక ఏకైక సంఘటనాత్మకము, ఏకైక ప్రయోజనాన్వితము, ఏకైకార్థ ప్రవణము, ఏకైక హేతునిష్పన్నం".

—డా॥ బి. వి. కుటుంబరావు

"ఏకాంశవ్యగ్రమై స్వయం సమగ్రమైన కథాత్మక వచనక్రియ కథానిక

-డా॥ పోరంకి దక్షిణామూర్తి

"కథానిక జీవిత ప్రవాహంలోని ఒక 'అల' వంటిది. అది క్షణికమయినా. దానికుండే శక్తి సామ ర్థ్యాలు విలువైనవి. హఠాత్తుగా ప్రారంభమై హఠా త్తుగా అంతమౌతుంది. ఆద్యంతాలు ప్రతిభావంతంగా ఉంటాయి. కథానిక తన ఉద్దేశాన్ని తుదిక్షణంవరకూ ఆణిచిపెట్టుకొని ఉంటుంది. తన ఉద్దేశాన్ని చెప్పి పఠితను ఒక విశేష ప్రభావానికి గురి చేస్తుంది.

—డా॥ శ్రీ అవుకు అంకిరెడ్డి

"ఒకే సంఘటన చుట్టూ కథ అల్లుకుపోయి భావంలో భిన్నత్వం రాకుండా ఒక ఐక్యతతో వుండే రచన 'చిన్నకథ'".

—శ్రీ కళ్యాణ సుందరీ జగన్నాథ్

"సాధారణముగా నతి విస్తృత క్షేత్రముకలిగి, ఒకానొక సత్యమునకో యధార్థమునకో సంబంధించిన ఉత్కంఠ సంవేదనముతో కూడి, స్వయం సంపూర్ణమై దానిలోని విభిన్న తత్వములను ఏకోన్ముఖములుగా చూపు ఇతి వృత్తాత్మక గద్య కవితా శిల్ప భాండమును 'కథానిక' అని నిర్వచింపవచ్చును".

—శ్రీ బొడ్డపాటి కుటుంబరాయ శర్మ

"ఒక అవస్థనిగానీ, ఒక అనుభవాన్నిగానీ ఒక వైచిత్ర్యాన్నిగానీ ఒక మనస్తత్వాన్నిగానీ చిత్రించేది కథ".

—శ్రీ హితశ్రీ

"సాధారణముగా ఒకే ఒక సంఘటననుగానీ, అంత కంటె ఎక్కువ సంఘటనలతో ఒకే ప్రయోజనాన్ని ఒకే ఆదర్శాన్ని దృష్టిలో పెట్టుకొని చిత్రించడాన్ని చిన్నకథ అనిగానీ, కథానిక అనిగానీ అంటారు.

—శ్రీ తాతా్కరు నాగేశ్వరరావు

"పాఠకుని కాలాన్ని వృధా చెయ్యకుండా, అతి తక్కువ కాలంలో విజ్ఞానంతోపాటు వినోదాన్ని కల్గిస్తూ, ప్రకృతి రహస్యాలను మానవుల విచిత్రచిత్ర ప్రవృత్తులను, ప్రమాణాల పరిణామాలను సూటిగా చెబుతూ, ఆశ్చర్యాన్ని కలిగించగలిగేదే కథానిక".

—శ్రీ ఎ. ఎస్. రామారావు

''చిన్నకథ ఒక సంఘటన కావచ్చు ఒక వ్యక్తి మనస్తత్వ పరిణామం కావచ్చు. ఒక సుదీర్ఘమైన ఇతివృత్తమే కావచ్చు. చిన్నకథలో కేవలం ఒకే ప్రత్యేకత ఉంది. సాధ్యమైనంత తక్కువ మంది వ్యక్తులతో తక్కువ సంఘటనలతో అది కథ కావాలి అంతేకాక అది స్వయం సంపూర్ణంకావాలి. అంటే కథకు ఆధారంగా తీసుకొన్న సంఘటనలతో వ్యక్తులతో చెప్పదలచుకున్నదానిని సంపూర్ణంగా చెప్పకలిగి ఉండాలి''.

—శ్రీ తూలికా భూషణ్

"ఏదో ఒక సంఘటనతో ప్రభావితమై ఆ సంఘటన చుట్టూ పరిమితమైన పాత్రలతో చిక్కగా, బిగువుగా, ప్రతిభావంతంగా అల్లబడే సాహిత్య ప్రక్రియే కథ లేక చిన్నకథ".

—డా॥ ఎల్. ప్రేమసాగర్

"కథకు ఎత్తుగడ బాగా వుండాలి. గమనము వేగముగా వుండాలి. Climax అద్భుతముగా వుండాలి".

—శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

"కథానికకు ప్లాట్(Plot) అనవసరం. ప్రారంభించడానికి చక్కని తెలివి కావాలి. వాతావరణం ఆరంభంలోనే స్పష్టం కావాలి''.

—శ్రీ పాలగుమ్మి పద్మరాజు

**పాశ్చాత్యులు :**

"ఒకే ఒక సంఘటనను - వాస్తవమైనదైనా, అభూతకల్పనతో కూడుకొన్నదైనా, చిత్రిస్తూ ఒకే సారి కూర్చుని చదువగలిగే ఒక సాహిత్య ప్రక్రియ చిన్నకథ''.

—ఎడ్గార్ ఎలెన్ పో

"ఆద్యంతాలు లేనిదే అసలైన కథానిక".

—ఆంటిన్ చెకోవ్

"కథంటే కథన రూపంలో చెప్పబడే చిన్న నాటకం".

—హెన్రీథామస్

''ప్లాటుకే సర్వస్వం".

—ఓ హెన్రీ

''ప్లాటులపట్ల నాకు మొదటినుంచీ ఆవగింజంతైనా అభిరుచిలేదు".

—హెచ్. ఇ. బేట్స్

''వాక్యం వెంబడి వాక్యాన్ని రసవంతంగా మార్చి పాఠకుడి హృదయాన్ని అలరించి చదివించగల శక్తియే కదానికా రచయితకుండవలసిన లక్షణాలన్నిటిలోనూ ముఖ్యమైనది'

-జాన్‌గార్స్ వర్దీ

కథానికకు సంపూర్ణమైన నిర్వచనమివ్వడం కష్టం. అందుచేతనే కథను నిర్వచించడంలోని ఇబ్బందుల్ని గూర్చి సోమర్‌సెట్‌మామ్ ఇలా అన్నారు. ''రచయిత తనకు నచ్చిన కథా లక్షణాల్ని మాత్రమే యిరికించి చిన్న కథలను నిర్వచిస్తున్నాడు అంతేకాని ఏ విధంగా వ్రాసిన పాఠకుల్ని ఆకర్షిస్తే ఆ విధానం మంచిదని మనం గుర్తించాలి".

ఆధునిక వచన సాహిత్య ప్రక్రియల్లో కథానిక ప్రత్యేకమైన లక్షణాన్ని కలిగి వున్నది. కథానిక లక్షణాలివి :

"(1) సంక్షిప్తత (2) ఏకాగ్రత లేక ఏకాంశ వ్యగ్రత (3) నిర్బరత (4) స్వయం సమగ్రత, (5) ప్రతిపాద్య ప్రవణత (6) సంవాద చాతుర్యం A వస్తువు, B పాత్రలు, C సంవాదాలు D వాతావరణం E శైలి F ఉద్దేశం (ఆదేశం లేక ప్రతిపాదితాంశం) అనేవి ఆరున్నూ కథన సాహిత్య మూలాధార తత్త్వాలు".

—డా॥ బి. కుటుంబరావుగారు

ఈ కథా లక్షణాలన్నీ సర్వసంపూర్ణముగా కలిగి, సంక్షిప్తముగా, సమగ్రముగా వచనముతో నడక సాగే ప్రక్రియ కథానిక.

-—o-

# శ్రద్ధాంజలి

డా॥ **రావూరి వెంకట సత్యనారాయణరావుగారు** సౌమ్యులు, సహృదయులు, స్రవంతికి ఆప్తులు-

ది. 2-7-1983నాడు **శ్రీ రావుగారు** శాశ్వతంగా కన్నుమూశారు. వారి ఆత్మ శాంతికై స్రవంతి శ్రద్ధాంజలి ఘటిస్తున్నది—

# బాలల కావ్యాలు

—డాక్టరు వెలగా వెంకటప్పయ్య

సంప్రదాయ విధానంలో ఛందస్సును అనుసరిస్తూ అభివృద్ధి పొందుతున్న విశిష్టమైన ప్రక్రియ పద్యం, ఇది బాలలకు సంబంధించినంతవరకు ఉపాఖ్యానాలుగా, కథా కావ్యాలుగా, ఖండ కావ్యాలుగా, శతకాలుగా విలసిల్లుతూ ఉంది. మనుచరిత్ర, పారిజాతాపహరణం మొదలైన కావ్యాలను ఉపనయనం అయిన తర్వాత విద్యాభ్యాసం ప్రారంభించే సమయంలో - అనగా శబ్దమంజరి, ఆంధ్రనామ సంగ్రహం ఇత్యాది పూర్తి చేశాక మన పూర్వులు చదివారు. అర్థప్రధానంగా వీటిని చదివారు. ఈపని దాదాపు పందొమ్మిదో శతాబ్ది చివరిదాకా సాగింది. నవీన విధానంలో పాఠశాలలు పెరిగాక ఈ పాత విధానం మరుగున పడింది. అయితే నూతన విద్యావిధానంలో పాఠ్యాంశాలతోబాటు గజేంద్ర మోక్షం, రుక్మిణీ కల్యాణం, అంబరీషోపాఖ్యానం మొదలైన ఉపాఖ్యానాలు టీకా తాత్పర్యాలతో ప్రవేశపెట్టారు. పిల్లలు వీటిని శ్రద్ధగా చదివి భాషా జ్ఞానం బాగా పెంచుకున్నారు. వ్యవహార జ్ఞానం అలవరచుకున్నారు. మన కావ్యాలు రచనలు ఆనందంకోసం రాశారనుకున్నా - ప్రతి రచనలో ఉపదేశం విధిగా ఉంటుంది. కనుకనే లాక్షణికులు 'కాంతా సమ్మిత వయోపదేశీయుడే' అన్నారు ఈ ఉపదేశాలు భారత, రామాయణాది ఇతిహాసాలలో, భాగవతాది పురాణాలలో, ప్రబంధాలలో, కావ్యాలలో ఉప కథల రూపంలో ఉంటాయి. ''కథలను ఉపాఖ్యానాలను పఠించునపుడు బాలబాలికల హృదయములందు కావ్యరసముతో పాటు ఉపదేశ సారము కూడ హత్తుకొని పోవుచుండును''[1] అంటారు దివాకర్ల వెంకటావధానిగారు.

మన ప్రాచీన రచనలలో ఉపాఖ్యానాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. భారతంలో ఉదంకోపాఖ్యానం, గరుడోపాఖ్యానం, కచదేవయాని, కపోతోపాఖ్యానం, హంస కాకీయోపాఖ్యానం, పాల్కురికి సోమనాధుని బసవ పురాణంలో బెజ్జ మహాదేవి కథ, మంచన "కేయూర బాహు చరిత్ర, కొరవి గోపరాజు "సింహాసన ద్వాత్రింశక"లోని ఉపకథలు, బమ్మెరపోతరాజు ''భాగవతం''లోని గజేంద్రమోక్షం, ప్రహ్లాద చరిత్ర, ధ్రువోపాఖ్యానం, అజామిళోపాఖ్యానం, వామన చరిత్ర, అంబరీషోపాఖ్యానం, రుక్మిణీ కల్యాణం, మున్నగునవి అమృత కలశములవంటి ఉపకథలు. వీటితో అనంతామాత్యుని భోజరాజీయములోని ఉపకథలు బాలబాలికలకు మరింత దగ్గరగా ఉంటాయి. కనుక ''బాలబాలికలందరూ భాగవతమునందలి ఉపాఖ్యానములను తప్పక చదువవలెను. అది వారి తెలుగుతనమునకు వన్నెకూర్చును. భావిజీవితమునకు పెంపు కలిగించును." అంటారు మరోచోట దివాకర్ల వెంకటావధానిగారు. మన చదువుల విధానంలో మార్పు వచ్చినా ఉపాఖ్యానాలు చదవడంలోని అవసరం తగ్గలేదు. తెలుగులో కథా కావ్యం అన్నది ఒక విలక్షణ

1. వెంకటావధాని, దివాకర్ల, ప్రాచీన సాహిత్యములో బాలల పఠనీయాంశములు, ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు - ప్రత్యేక సంచిక 1977, పు. 3.

మైన ప్రక్రియ. తిక్కనకు సమకాలికుడైన మూల ఘటికకేతన ఈ ప్రక్రియకు శ్రీకారం చుట్టాడు సంస్కృతంలో దండి రాసిన "దశకుమార చరిత్ర"ను కేతన పద్యకావ్యంగా తెలుగులో అవతరింపజేశాడు.

కేతన ప్రారంభించిన పద్ధతిలో అనేక చక్కని కావ్యాలు వచ్చాయి. వాటిలో అనంతా మాత్యుని భోజ రాజీయం మంచి ప్రసిద్ధిని పొందింది. ధారా నగరాన్ని పాలించిన భోజరాజుకు సంబంధించిన కథే "భోజ రాజీయం" ఇందులోని ఒక ఉపకథ ఆవూ-పులి కథ. ఒక రోజు ఒక ఆవు అడవిలో మేస్తుండగా పులి దాన్ని పట్టుకున్నది. "ఇంటివద్ద లేగదూడ ఉంది. పాలిచ్చి కడసారి దాన్ని కళ్ళారా చూచి వస్తాను. సంతోషంగా నీకు ఆహారమౌతాను" అని అర్థించింది ఆవు. పులిలాంటి దుష్ట జంతువు మనసును కరగించి, దాని విశ్వాసాన్ని చూరగొని ఇంటికి వెళ్ళి, శమనం చేసి, తిరిగి పులివద్దకు వస్తుంది. గోవు సత్య సంధతను చూచి పులి నివ్వెరపోతుంది. ఇంటికి వెళ్ళి సుఖపడమని అనుగ్రహిస్తుంది. కాని "ఇచ్చిన మాట తప్పడానికి వీల్లేదు. నీ నోటివెంట నాకు స్వర్గధామాన్ని అనుగ్రహించు" అంటూ ఆవు దగ్గరికొస్తుంది. సత్యవాక్పరిపాలనం పట్ల ఆవుకున్న అనురక్తినీ, పులి కరుణాంత రంగాన్ని చూచి దేవతలు జయధ్వానాలు చేస్తారు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై అనుగ్రహిస్తాడు. ఈ కథ ఆబాల గోపాలం అందరకూ తెలిసిందే. దాన్ని మొదట కావ్యస్థం చేసిన ఘనత అనంతా మాత్యునికే దక్కింది.

ఆవు బిడ్డకు పాలిచ్చి - తాను పులికి ఆహారంగా వెళుతున్నానని చెప్పి - దుఃఖోపశమనం కలిగించే తీరు హృదయ విదారకంగా ఉంటుంది.

"ఆడకు మసత్య భాషలు
కూడకు కొఱగాని వాని గొంకక యొరులె
గ్గాడిన నెదురుత్తర మీ
జూడకు, విని వినని వానిచొప్పున చనుమా"
"ఒంటి చరింపకు పొలమున
ఇంటికి కడుప్రొద్దుగలుగ ఏతెంచుచురా
వెంటబడి పొడుచు గోవుల
చెంట జనకు, క్రయ్యబడకు సందడియగచోన్"
"చులుకన జలరుహ జంతువు
చులుకన తృణకణము, దూది చుల్కన సుమ్మీ
యిల నెగయ ధూళి చుల్కన
చులుకన మఱి తల్లిలేని సుతుడు కుమారా!"

చివరి మాటలు విన్న ఎవరికైనా కనులవెంట నీరు రాక మానవు. కరుణరస ప్రధానమైన ఈ కథ చదివినపుడు బిడ్డలపై గోవుకుగల "సత్యవాక్శుద్ధి, కృపా సమగ్ర బుద్ధి" ప్రభావం పడకపోవు. అదే ఉపాఖ్యానాల ప్రయోజనం.

## పద్య, గేయ కావ్యాలు

తెలుగులో పిల్లలకోసం రచింపబడిన పద్య, గేయ కావ్యాలు చాల తక్కువ. అయినప్పటికీ వచ్చినవి "గంగి గోవుపాల" వంటివి. బాలల కావ్యాల నిర్మాణ పద్ధతిని గురించి ఉత్పల సత్యనారాయణా చార్యులు గారు యిలా అంటారు"......పిల్లలకు తెలిసి, ఇంకా తెలుసుకోవలసిన విధంగా కావ్యం ఉండాలి. అది భావ చాతురిలోనూ, వ్యంగ్యంలోనూ, నిర్మాణ చాతురిలోను కనబరచాలి. కొన్ని కొన్ని శబ్దాలలోనూ వెల్లడించాలి ఆ కావ్యం ప్రాచీన కావ్యసౌధానికి సోపానంగా ఉపకరించాలి"[2]అలా ఉన్నపుడే కావ్యపఠనం పిల్లలకు ప్రయోజనకరంగా ఉంటుంది". ఈ కావ్యాలకు ఉండవలసిన లక్షణాలను గురించి దివాకర్ల వెంకటావధానిగారు ఇలా అంటారు.

"అవి సాధారణముగా పాడుకొనుటకు అనువగు గేయములుగా నుండును. అందలి భాష సరళమై

2. సత్యనారాయణా చార్య, ఉత్పల, బాలలకోసం. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు - పత్యేక సంచిక 1977, 180 పు.

సుబోధమై, వ్యవహారమునకు దగ్గరగా నుండును. భావములు సుకుమారములై లేత హృదయములలో కూడ అద్భుత స్పందనము కలిగింపవలసి యుండును."[3] వానిలో 'పునరుక్తి' దోషములేదు. దాదాపు ఈ లక్షణాలన్నీ ఉత్పలవారి కావ్యాలలో ప్రతి బింబించబడినందున అవి విశేష ప్రచారాన్ని అందు కున్నాయి. ఉత్పలవారు 'గంగావతరణము' (1958) కావ్యంతో ఈ వాఙ్మయానికి శ్రీకారం చుట్టారు. ఆ తర్వాత "క్షీరసాగర మథనము' (1958); శమంతక మణి (1962, "దక్షయజ్ఞము' (1967, "పార్వతీ కల్యాణము" (1967), "కుమార సంభవము" (1967), "మనుచరిత్ర" (1976), "అర్జునుడి తీర్థయాత్ర" (1976), "చిన్నికృష్ణుడు" (1979) ప్రచురించారు ప్రచారంలో ఉన్న పురాణ కథలను స్వీకరించి, తెలుగుదనపు సారాన్ని చేర్చి, కథలలో అచ టచట కొద్దిపాటి మార్పులను చేసి పురాణకథలు చదివేప్పుడు పిల్లలకు కలిగే సందేహాలను తొలగించ డానికి ప్రయత్నించారు.

"సగరు డనెడి మహారాజు
చాలగొప్ప బలవంతుడు
అతనికి ఇద్దరు భార్యలు,
అరవై వేల కుమారులు,
ఆరాజొక అశ్వమేధ
యాగమ్మును చేయదలచి
గుర్రమ్మును పూజచేసి
కొడుకులతో సాగనంపె."

ఇలాచక్కని కథా కథన శైలితో ప్రారంభ మవుతుంది. "గంగావతరణము" కావ్యం. సర్వత్ర ప్రసన్న మైన శైలితో, రమణీయ వర్ణనలతో, చక్కనిపాత్ర పోషణతో రచన సాగుతుంది. రచనలో ఎడనెడ కవి గారు వాడిన ఉపమానములు అద్భుతములని దివాకర్ల వారి అభిప్రాయం, "శమంతకమణి" కావ్యంలో-చవితినాటి చంద్రునివారు "రేయిచుక్కల త్రోవలో నారింజ తొనవలె చంద్రుడొప్పె'' నని వర్ణించినారు' సూర్యుడు సత్రాజిత్తు ముందు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు "సంద్రమెల్ల బంగారపు ఛాయంతో మెరసి పోయె- దిక్కులందు బంగారపు తెరలుదించినట్లాయె. అని కవిగారు చేసిన వర్ణన హృద్యంగా ఉంది. 'అర్జునుని తీర్థయాత్రలు" కావ్యంలో ఉత్పలవారు భారత దేశంలోని ప్రసిద్ధ స్థలాలను మనోజ్ఞంగా చిత్రించి పిల్లలలో చారిత్రక, సాంస్కృతిక స్పృహ కల్గించడా నికి దోహదం చేశారు కావ్య రచనలో ఉత్పలవారిది తలమానికమైన కృషి అని తరగాధమైన ప్రయత్నం. కావ్యరచనను గేయరూపంలో మరొక ప్రముఖుడు అలపర్తి వెంకట సుబ్బారావుగారు ఏకలవ్యుడు (1), స్నేహధర్మం (1974), ఏకలవ్య కుచేల కథలను కొత్త పద్ధతిలో రాశారు. సరళభాష, భావం, శైలి పిల్లలు ఉత్సాహపడి చదివేట్లుగా ఉంటుంది. స్నేహధర్మం కావ్యాంతంలో బాలలను ఉద్దేశించి ఇలా చెబుతారు.

"మంచిమిత్రుని ఎంచుకొనుడు
ఎంచిచెలిమిని పెంచుకొనుడు
కష్టసుఖములు పంచుకొనుడు
ఇష్టసఖులని పించుకొనుడు'

ఇలాటి సదుపదేశాల ప్రభావం బాలలమీద ఎంతో ఉంటుందనడంలో సందేహంలేదు కవుల అంజనేయ శర్మ (1932-) గారు దక్షయజ్ఞం(1960) చక్కని గేయ కావ్యంగా మలిచారు.

మరొక గేయకావ్యం బి. ఎన్. శాయిగారి "పాపాయి పతకం'' (1968) గేయకావ్యాలు మొత్తం పదికి మించిలేవు. కవులు యీశాఖను పరిపుష్టం చేయ వలసి ఉంది.

3. వెంకటావధాని, దివాకర్ల బాలసాహిత్యంలో రసవత్కావ్య సృష్టి, ఆంధ్రపత్రిక - 11-2-1962.

## ఖండకావ్యాలు

తెలుగు సాహిత్య చరిత్రలో ఖండకావ్య సృష్టి ఒక ప్రత్యేక ప్రతిపత్తిని కలిగి ఉంది. సాహిత్యాన్ని ప్రజలలోకి తీసుకుపోవడానికి ఈ ప్రక్రియ బాగా ఉపకరించింది.

"ఆధునికాంధ్ర కవిత్వంలో ఖండకావ్యప్రక్రియ రాయప్రోలుతో పొటమరించినా, పుష్పించింది. జాషువా కవిత్వంలోనే. ఖండకావ్యం వ్రాసి అఖండ కావ్యస్ఫూర్తిని అందించిన కీర్తి జాషువాకే దక్కింది"[4] అంటారు నారాయణరెడ్డిగారు. "నవ్యాంధ్ర సాహిత్యాన్ని ప్రభావితం చేసిన భావ కవిత్వోద్యమం నుంచి ఖండకావ్య ప్రక్రియను వేరుపరచలేము. భావ కవిత్వంలో అంతర్లీనమై పోయిన ఆ ప్రక్రియ దానితో బాటు స్ఫుటమైన రూపురేఖలను దిద్దుకొన్నది. నవ్యాంధ్ర కవిత్వంలో లోకంలో ఉత్తమ కవులుగా లబ్ధప్రతిష్ఠులైన వారందరూ చక్కని ఖండకావ్యాన్ని వెలయించిన వారే"[5]

వీరిలో చాలమంది అనగా వెంకట పార్వతీశ్వర కవులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, నాయని సుబ్బారావు, పింగళి లక్ష్మీకాంతం, నాళం కృష్ణరావు, కవికొండల వెంకటరావు, కనుపర్తి వరలక్ష్మమ్మ, యస్వీ జోగారావు, పద్లమూడి గోపాలకృష్ణయ్య, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారలు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు.

బాలలకోసం చక్కని ఖండకావ్యాలను బాలగీతావళి పేరుతో వెంకటపార్వతీశ్వర కవులు రాశారు. అవి పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించబడి (ఫోర్టు సెంట్‌జార్జు గజట్ 142 పుటే 30.4 1940) మరింత ప్రచారంలోకి వచ్చాయి. గున్నమామిడి చెట్టుఇచ్చే బహుళ ప్రయోజనాలను వెంకటపార్వతీశ్వర కవులు ఇలా వర్ణించారు.

"చివురువచ్చుచుండెఁ జిన్నకోయిలలకు
ఫలములిచ్చుచుండె జిలుకలకును
నీడలిచ్చుచుండు నీకును నాకును
తనకుమామిడేమి దాఁచుకొనియె!
"కోకిల సుఖింపఁ దనకేమి కూడివచ్చె?
చిలుక తనివొందఁ దనకేమి కలసివచ్చె?
ఇతరులు సుఖింపఁ దనయొడి యేమినిండె?
గున్నమామిడి యేమను కొనెనొగాని!!

అంటూ గున్నమామిడి ఇతరులను సుఖపెట్టి ఎలా తృప్తిపొందు తున్నదో వివరించారు. దీనిలో 'పరుల మేలు మన మేలుగా' బిడ్డలకిచ్చిన సందేశం మరువరానిది.

ప్రకృతి సహజంగా వచ్చే గాలివానకు పశు పక్ష్యాదులు ఎలా గూడూ నీడా పోగొట్టుకుంటాయో గిడుగు వెంకట సీతాపతిగారు ఒక్క పద్యంలో చెబుతారు.

"జువ్విచెట్టుమీద గువ్వపిట్టలురెండు
గూడుకట్టుకొనెను జోడుగూడి!
రివ్వున సుడిగాలి రువ్వుచూవచ్చింది
గువ్వలెగిరిపోయె; గూడుపోయె!"

ఇసుకలో బొమ్మరిల్లు కట్టుకొని ఆడుకొనే తీరును యస్వీ, జోగారావుగారు "బొమ్మరిల్లు" ఖండికలో (ఆంధ్ర వారపత్రిక 14 డిశంబరు 1949)[6] వివరించారు.

"బడి విడుచునంత నింటికి పరుగులెత్తి
పలక బలపాలు గూడిలో పదిలపఱచి
అమ్మ యిచ్చిన పప్పు బెల్లమ్ము దినుచు
నాడుకొనబోదు నీవు సాయంతనమున
ఊరిదాపల నొక సెలయేరు గలదు
కల విసుకపసకలు దాని గట్టుమీద
ఇచ్చవచ్చిన మచ్చున నీ వచటను
ఈడు జోడె నవారితో నాడుకొనుము.

4. నారాయణ రెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వం, 1977, 165 పు. 5. భాస్కర చౌదరి, బి. జాషువ జీవిత కవితా ప్రస్థానం, 1077, 57. 6. ఆంధ్ర వార పత్రిక 14-12-1949.

ఇలా బొంగరం ఆట ఆడుకొనే విధానాన్ని జోగా రావుగారు ఖండ కావ్యంలో వివరిస్తారు.

## నీతి శతకాలు

దాదాపు వెయ్యి సంవత్సరాలనుంచి రచింప బడుతున్న తెలుగు శతకాలు వేలసంఖ్యలో ఉన్నాయి. అందు ఒక విభాగమైన నీతి శతకాలు వందదాకా ఉన్నాయి. భారతీయ సంప్రదాయంలో నీతి వర్ణనకు ఎంతో ప్రాధాన్యం ఉంది. అందుచేత బిడ్డలకు చిన్నతనమునుంచే జీవితసూత్రాలను చక్కని నీతులద్వారా చెబుతారు. భావాలతోబాటు, వారికి మంచిభాష ఉచ్చారణా శక్తి, స్వరజ్ఞానం, అలవడాలని దాశరథీశతకం మొదలైనవి ముందుగా ప్రారంభిస్తారు. ఆ తర్వాత సులభశైలిలో సుమతీశతకం, కుమారశతకం మొదలైనవి అందిస్తారు. "తెలుగు శతకములలో ప్రధానముగా పాటింపబడిన లక్షణములివి -

1 సంఖ్యా నియమము, 2 మకుటనియమము, 3 ఛందోనియమము, 4 రస నియమము, 5 ఆత్మాశ్రయ కవితాకర్మము" [7] మొదలైనవి. వీటికి అదనంగా శతకాల్లో భాష సాధారణంగా సరళంగా ఉంటుంది. ఏపద్యానికాపద్యం వేరుగా ఉంటుంది. అన్ని శతకాలలో ఈ నియమాలన్నీ పూర్తిగా ఉండవు. కొన్ని కొరవలు ఉంటాయి. ప్రత్యేకంగా పిల్లలను దృష్టిలో ఉంచుకొని రాసిన శతకాలు ఇటీవలి కాలందాకా లేవని చెప్పవచ్చు వేమన శతకంలో సులభశైలి, సరళభావం గల కొన్ని పద్యాలు పిల్లలకు పనికి వచ్చేవి, లేక పోలేదు చిల్లరిగె యోగానందం గారు. "బాలశతకం" (1915) ప్రచురించారు. విద్య, ఆరోగ్యం, సజ్జన స్నేహం, దుర్జన లక్షణాలు, వ్యసనాలు ఇందు వర్ణించబడ్డాయి ఆ తర్వాత ''బాలనీతి శతకం' (1916) వెలువడింది. చిల్కా వెంకట కృష్ణయ్యగారు "కుమారశతకం" (1915), సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు "కుమారశతకం" (1920) ప్రచురించారు ఆ తర్వాత బహుకొద్దిగా బాలశతకాలు వచ్చాయి. పిల్లల పుస్తకాలకు అవసరం, గిరాకి పెరిగాక శతక పరంపర ప్రారంభమైనది.

''బాల'' పత్రిక ప్రారంభించిన రోజులలో (1946 ఏప్రిల్) ముళ్ళపూడి వెంకటరావుగారు ''బాలశతకాన్ని ప్రారంభించారు.

''ఛందస్సు గణాలు లేకనే
నేరాసిన పద్యములను సైరించుచు న
న్నుత్సాహ పరుప గోరెద
నా జేజే లివిగో- నీకుగైకొను బాలా!
''స్నేహితులతో తగ వాడక
గురువులపై భక్తియుంచి తగనేర్పుగనీ
చదువులనెల్ల గ్రహించుచు
తగువేళకు ఇల్లుచేరు సుఖముగబాలా"

తెలుగు సంస్కృతితోబాటు అనేక విషయాలు సరళంగా పిల్లల మనస్సులకు హత్తుకొనేట్లు" నార్ల చిరంజీవిగారు రాసినది. "తెలుగుపూలు'' (1954) ఈ పూలు బాలసాహితికి సుమ సౌరభాలు సమకూర్చుతాయి.

"దేశమేదన్నచో తెలుగుదేశ మనుము
జాతి యేదన్నచో తెలుగుజాతి యనుము
వంశమేదన్నచో తెలుగువాడ ననుము
తెలుగుకీర్తిని చాటుము తెలుగుబిడ్డ"

ఇలా తెలుగుబిడ్డ తెలుగుదేశం, జాతి మొదలస్ఫూర్తిని కలిగిస్తూ- మన నేతలైన వీరేశలింగం, గిడుగు, గురజాడలను గుర్తుచేస్తారు.

''విప్లవ గుణశాలి వీరేశలింగము
పెంకెపండితులకు పిడుగు గిడుగు
మన మహా మనీషి మనవాడు గురజాడ
తలచుకొనుమువీరి తెలుగుబిడ్డ"

7. గోపాలకృష్ణారావు, కె ఆంధ్రశతక వికాసము. 1976, 7 పు.

జననీ జన్మభూమిశ్చ,స్వర్గాదపి గరీయసీ, అన్న సూత్రాన్ని-

"జన్మభూమికంటె స్వర్గంబువేరేది
మాతృభాష కంటెమధురమేది
కన్నతల్లికంటె ఘనదైవ మింకేది
తెలియమయ్య నీవు తెలుగుబిడ్డ"

అనిబోధిస్తాడు. ఈ శతకంలోని ప్రతిపద్యం ఒక జాతి రత్నం. లలిత సుగుణజాల! తెలుగుబాల!" మకుటంతో జంధ్యాల పాపయ్య శాస్త్రి "కరుణశ్రీ" (1912-) "తెలుగుబాల" (1953) శతకాన్ని రాశారు ఇదిబాగా ప్రచారమైన శతకం. ముడిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు "తెలుగుబిడ్డ" (1954) శతకాన్ని బృందావనం రంగాచార్యగారు. "తెలుగుబోధ" (1954) శతకాన్ని రాశారు. బాలవాఙ్మయంలో అత్యంత శోభాయమానంగా వెలుగులోకి వచ్చిన శతకం కవిరావు (1927-) గారి 'ముద్దుపాప' (1956) పాపలకు చక్కని సదుపదేశం చేస్తుంది ఈ శతకం.

"బడికివేళకేగి పాఠాలు వల్లించి
కొత్తవాని నేర్చు కొనగ వలయు;
క్రమము తప్పకుండ శ్రమజేసి తెనియు
వృద్ధిపొంద గలవు ముద్దుపాప!

ఇలాగే ప్రతిపద్యంచక్కని నీతిబోధతో నిక్షిప్తమై యుంటుంది, ఈ కోవకు చెందిన మరొక శతకం "వత్సోపదేశము" (1963) చలసాని లక్ష్మినారాయణ (రవివర్మ) రచన "శ్రీరామ కందము" (1972)ల పేరుతో పి. వి. ఎస్, పాత్రోగారు బిడ్డలకు చక్కని హితోపదేశం చేశారు, అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా వెలువడిన రచనలలో రెడ్డి రాఘవయ్య (1938-) గారి 'బాల నీతిమాల' (1979) మంచిరచన 'తెలుసుకొనుము నీవు తెలుగుబాల' మకుటంతో తెలుగు బాలలు నేర్చుకోవలసిన విషయాలు తేటపరిచారు. *

## దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర
## హిందీలో ప్రకటించిన గ్రంధాలు

తెలుగు గల్పమాల-1

1. గోదావరి హంస్‌పడీ — రు. 10-00
(20 తెలుగు కధానికలు)
2. తెలుగుగల్ప మాల-2
ఏక్‌కాలీ ఖిల్ ఉఠీ- — రు. 10-00
(20 తెలుగు కధానికలు)
3. మేరీజీవన యాత్ర
ప్రథమ ఖండ్-
రచన : ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం — రు. 6-00

ప్రతులకు :
**దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర,**
ఖైరతాబాద్, హైదరాబాద్ 500 004.

# వేమన : సామాజిక స్పృహ

—కె. ఎ. భాస్కర రావు

రసానుభూతిని కలిగించే భావ ప్రకటనే కవిత్వం. ఒక వ్యక్తి తాను నమ్మిన సత్యాన్ని, లేదా ధర్మాన్ని, ఇతరులతో పంచుకోవడానికి ప్రయత్నంచేస్తాడు. తాను బలంగానమ్మిన ఒక విశ్వాసాన్ని సమాజంలో ప్రచారం చేసి, దానికి ఆదరణ తెచ్చేటందుకుప్రయత్నంచేస్తాడు అందుకు అతనిలోవున్న సృజన శక్తితోడ్పడుతుంది. లలిత కళలు అందుకు ప్రచార సాధనాలుగా వుపయోగ పడతాయి. భావ ప్రకటన పద్యంలో చెప్పవచ్చు, గద్యంలో చెప్పవచ్చు. గేయంలో చెప్పవచ్చు, నాటకంలో వ్రాయవచ్చు, చిత్రలేఖనంలో చూపవచ్చు. ఏ ప్రక్రియతో చెప్పినా, పాఠకునిపై ప్రభావం కల్గించి అతని మనసుపై ముద్రవేయగల్గాలి దాని వల్ల అతనికి ఆనందం కలుగవచ్చు, ఆవేశం కలుగవచ్చు లేదా ఆలోచన కల్పించవచ్చు. అదే రసానుభూతి.

మానవుని నాగరికతతో పాటు, అతనిలోని సృజన శక్తికూడ పనిచేయడం ప్రారంభించింది. ప్రకృతి పరిసరాల ప్రభావానికి అతను స్పందిస్తూనే వున్నాడు. శోకం నుండి వాల్మీకి శ్లోకం ప్రారంభించాడు దాని ఫలితం రామాయణం. అలాగే భారత, భాగవతాలు, మానవతా విలువను అవి ఎలుగెత్తి చాటాయి.

"భాగవతమున భక్తి, భారతములో యుక్తి
రామకథయే రక్తి" అన్నారు

మహాకవి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్ని నాటక ప్రక్రియలో రూపొందించి, సాహిత్యానికి పరాకాష్ఠ చేకూర్చారు. "కావ్యేషు నాటకం రమ్యం" ని నిరూపించారు. మానవ జీవితపు సమస్యలన్నింటికీ సమాధానం చెప్పారు. విశ్వ శ్రేయస్సును కోరి సాహిత్యంలో శాశ్వతమైన స్థానాన్ని పొందారు.

కవులు వేనవేలు కాళిదాసొక్కడు
బుధులు వేనవేలు బుద్ధుడొకడు
ఘనులు వేనవేలు గాంధి మాత్రమొకండు-

వీరు వ్యక్తి శ్రేయస్సుతో పాటు, విశ్వ కల్యాణం కోరిన మహాపురుషులు.

ఐతే కళ కళకోసమేనన్న ఒక వాదం లేకపోలేదు. వారి దృష్టిలో కవిత్వం, ఇతర రచనా ప్రక్రియలు ఆత్మానందం కోసమేనన్న భావంకూడా వుంది. పండితులకు మాత్రమే అర్థమయ్యే జటిలమైన భాషతో అనేకమైన కావ్యాలు, ప్రబంధాలు వచ్చాయి మేధస్సు సాధన వారితో వున్నా, పరిమితమైన ప్రయోజనాన్నే అని చేకూర్చాయి కాల ప్రవాహంలో పరిపాలనా వ్యవస్థలో అనేకమైన మార్పులు వచ్చాయి. రాజులు, చక్రవర్తులనుండి, ప్రజలే తమ భవిష్యత్తుకు నాయకత్వం వహించే వ్యవస్థ ఈ నాడు మనకు ఆచరణలో వుంది. రాక్షసత్వములుపోయి, రాచరికములు పోయి, ఈ నాడు ప్రజలదే పైచేయి. ఒక అభ్యుదయ కవి చెప్పినట్లు-

"రాజుపోయె అతని రాణువ పోయెను
నందిపోయె అతని చెంబుపోయె
సార్వభౌముడయ్యె సామాన్యుడీనాడు,"

తెలుగు సాహిత్యంలో కవిత్వాన్ని ప్రజలకు సన్నిహితం చేసిన మొదటి కవిగా వేమన్నను పేర్కొనవచ్చు, తెలుగుతల్లి ప్రసవించిన మొదటి ప్రజాకవి

వేమన. తెలుగునాట రాముని గుడిలేనివూరు వేమన పద్యం కనీసం ఒకటైనా చదవనివారు లేరంటే అతి శయోక్తిగాదు. "విశ్వదాభిరామ వినరవేమ" అన్న మకుటంతో, జీవితాన్వేషణలో అందివచ్చిన అనుభ వాలను, ఆట వెలదుల్లో, అత్యంత రమణీయంగా అం దించాడు ఆ మహానుభావుడు. వేమన ఎప్పుడు పుట్టినా, ఎక్కడ పుట్టినా, తెలుగు బిడ్డగా పుట్టడం జాతికి గర్వ కారణం. అయన తెలుగువారి విశ్వకవి, భారతీయుల విశ్వకవి.

తెలుగు ప్రజానీకానికి వేమన్న ఒక మహాయోగి భోగిగా జీవితాన్ని ప్రారంభించి, యౌవనంలో చేతి కందిన ఐహిక భోగాలను అనుభవిస్తూ పోయారు. అందులో ఆయనకు పరమార్థం కన్పించలేదు. కాంచ నం, వంచనం రక్తిమార్గంలో ముళ్ళపొదల్లా ఆయనకు కన్పించాయి. మనుషుల మధ్య తిరుగుతూనే, జీవిత సత్యాలను, నిత్యాన్వేషణలో దర్శించి, విమర్శించిన వివేకి వేమన్న. అల్పమైన పదాలతో అనల్పమైన అర్థాలను సృష్టించి, సామాన్యులకోసం ఆనన్య సామా న్యంగా వ్రాసిన ప్రజాకవి.

అందుకే: చెరకు రసమూల మాట, చిన్మయత్వపుతేట
యోగి వేమన మాట అన్నారు

ఆయనకు పాండిత్యముకంటే పరమార్థం గొప్పది అందుకే పాండిత్యంకోసం పండితులను ఆశ్రయించ లేదు. పరమార్థం కోసం జీవితాన్ని గురువుగా ఎంచు కొన్నారు. వివేకాన్ని నమ్మినంతగా విశ్వాసాన్ని నమ్మలేదు. స్వయం కృషితో సత్యాన్ని స్వాయత్తం చేసుకొన్న సాధకుడు వేమన్న. భగవంతుని చేర్చే మార్గాల నన్నింటినీ పరామర్శించి పరిశీలించారు. మని షికి, భగవంతుడికి మధ్య మతంపేరట కల్పింపబడిన ప్రతిబంధకాలు ఆయనకు చికాకు కల్గించడమే గాక, మనసును గాయం చేశాయి. బహిర్ముఖమైన జీవితం మీద ఆయనకు కోపం వచ్చింది. అంతర్ముఖుడై, ఆయన తనలోనే భగవంతుణ్ణి చూచుకొన్నారు.

తన కవితల్లో స్వేచ్ఛగా ఆలోచించడం కూడా వేమన్న మనకు నేర్పారు. ప్రభుస్వామ్య వ్యవస్థలో తాను ఆనాడు వుండి కూడ, ప్రజాస్వామ్య లక్షణాలకు ఆయన పునాదులు వేశారు. తన తరువాత భావ విప్లవం రచనల్లోకు పెట్టిన కవి వేమన్న, ఆయన భాషలో. భావనలో రీతిలో, నీతిలో స్వాతంత్ర్యపు లక్షణాలు స్పష్టంగా కన్పిస్తాయి. ఆగ్రహంతోచెప్పినా; నిగ్రహంతో చెప్పినా, ఆయన మాటల్లో వ్యంగ్యం హాస్యధోరణి, సమాజ శ్రేయస్సు ప్రధానంగా కన్పి స్తాయి. కవ్విస్తూ, నవ్వించే శక్తి తెలుగు సాహిత్యా నికి వేమన ప్రసాదించారు.

సాహిత్యంలో సామాజిక స్పృహకు నాంది పలికిన వాడు వేమన్న అని నిస్సందేహంగా చెప్పవచ్చు. సామా జిక స్పృహ లక్ష్యంగా చేపికొన్న నేటి అనేకమంది రచ యితలకు వేమన్న ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, వుత్తేజం కల్పించాడు. ఆయన పద్యాలలో సాంఘిక స్పృహ కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుంది వేమన తత్వం మానవతావాదం. ఆయన దృష్టిలో మనిషేదేవుడు మనుషుల మధ్య తర తమ భేదం లేదంటారు. మాన వుడు అజ్ఞానంతో కల్పించుకొన్నవే కుల- మత భేదా లంటారు ఆయన దృష్టిలో సమాజంలో వున్న బాధ లకు, దుఃఖాలకు, మూలకారణం వర్ణవ్యవస్థే ఇది వున్నంతకాలం సమాజంలో సమస్యలు తప్పవంటారు.

ఉర్వివారికెల్ల ఒక్క కంచము బెట్టి
పొత్తుగలిపి కులము పొలయజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వదాభిరామ వినురవేమ.

అందరూ ఒక్క కంచాన తింటే, అన్ని బాధలకూ మూలమైన కులభేదం మాసిపోతుంది. సఖ్యత వుం టుంది. యీ సత్యాన్ని ప్రజలు విశ్వశించేటట్లు తల మీద చేయివేసి ప్రమాణ పూర్తిగా చెప్పమంటారు వేమన,

సమాజంలో ఆర్థిక వ్యత్యాసాల వల్లనే సమస్యలు ని ఆయన కాలంలోనే గుర్తించారు

అర్థబలం వున్నవాడికీ, అధికారబలం వున్నవాడికి సమాజం దోహదం చేస్తుందని ఎంతో చక్కగా చెప్పారు.

పుత్రుడికలవాని పుండుబూడైనను
వసుధలోన చాలవార్తకెక్కు
పేదవాని ఇంట పెండ్లైన ఎరుగరు
విశ్వదాభిరామ వినురవేమ.

ప్రజలలో పేదరికం, అజ్ఞానం వున్నంతకాలం ఈ పరిస్థితి కొనసాగుతూనే వుంటుంది ఐతే ఇలాంటి సమాజంలో కూడ కొంతమంది సజ్జనులు వుంటారు. విజ్ఞతతో అలాంటి వాళ్ళను గుర్తించి, ప్రోత్సహించాలంటారు వేమన్న.

ఉప్పు కప్పురంబు ఒక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ.

ఉప్పు, కర్పూరం చూడడానికి రెండూ తెల్లగానే వుంటాయి. రుచి చూస్తేగాని ఏదేమిటో తెలియదు. అలాగే సహవాసం చేస్తేగాని ఎవరి స్వభావమేమిటో తెలియదు మనుషులలోని మంచి-చెడులను నిర్ణయించే సామర్థ్యం వుంటేనే, సమాజం బాగుపడుతుంది. చెడును నిరసించి, మంచిని ప్రోత్సహించే సంస్కారం నేటి సమాజానికి ఎంతో అవుసరం.

జీవితంలో చిన్న విషయాలు మనకెన్నో సమస్యలను తెచ్చిపెడుతుంటాయి. వాటిని సకాలంలో పరిష్కరించకపోతే, అవే చినికి- చినికి గాలివానలా తయారౌతాయి.

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు,కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత కాదయా
విశ్వదాభిరామ వినురవేమ।

ఆధునిక జీవితంలో శాస్త్ర విజ్ఞానం మనకు ఎన్నో సదుపాయాలు కలుగజేసినా, సక్రమ కుటుంబ జీవితానికి సరైన అవగాహనే మార్గం. కామం మానవ సహజం సంసారాన్ని సుఖమయం చేసికోడానికి ఇదొక గక్కని సాధనమంటారు వేమన్నగారు.

కామిగాని వాడు కవిగాడు, రవిగాడు
కామిగాక మోక్ష గామికాడు
కామియైనవాడె కవియౌను, రవియౌను-

అని తేటతెల్లం చేశారు. తల్లి-దండ్రుల పట్ల దయతో ప్రవర్తించమంటారు వేమన్న. జన్మనిచ్చిన తల్లి- దండ్రులపై ప్రేమ జాలి సానుభూతి లేకపోతే అలాంటివాడు మనిషికాదనీ, పుట్టినా, చచ్చినవాడితో సమానమనీ ఆయన వుద్దేశం.

తల్లి-దండ్రిమీద దయలేని పుత్రుండు
పుట్టనేమి? వాడు గిట్టనేమి?
పుట్టలోని చెదలు పుట్టవాగిట్టవా?
విశ్వదాభిరామ వినురవేమ!

నిరంతరం పుడుతూ, చచ్చే చెదల జీవితానికి దిగజారకుండా వుండాలంటే, మానవ జీవితానికి కొన్ని లక్ష్యాలు, విలువలు వున్నాయని ఆయన చక్కగా గుర్తుచేశారు.

జీవితంలో జయాపజయాలు వస్తూనే వుంటాయి. జయం కల్గినపుడు సంతోషించడం, అపజయం కల్గినపుడు నిరుత్సాహ పడటం మానవ బలహీనత స్థాన బలాన్ని బట్టి, పరిసరాలను బట్టి మన జీవిత విధానాలను కూడ మార్చుకోవాలంటారు వేమన్నగారు.

అనువుగాని చోట అధికులమనరాదు
కొంచెముండుటెల్ల కొదువకాదు
కొండ అద్దమందు కొంచమై యుండదా?
విశ్వదాభిరామ వినురవేమ!

అంత కొండకూడ పరిస్థితులు అనుకూలించకపోతే, చిన్న అద్దంలో ఇమిడి పోతుంది. అలాగే పరిస్థితులకు అనుకూలంగా వ్యవహరించడం వల్ల వ్యక్తులు నిరాశ నుండి బయట పడవచ్చు. ఒక వూరిలో ఎంతగానో గౌరవింపబడే వ్యక్తి, మరొకవూరిలో ఎవరికీ తెలియక పోవచ్చు. అందువల్ల ఆతను అవమానకరంగా భావించ కూడదు. స్థాన బలిమిని కూడ గుర్తించాలి.

నీళ్ళలోన మొసలి నిగిడి ఏనుగుబట్టు
బయటకుక్క చేత భంగపడును
స్థానబలిమికాని తనబలిమి కాదయా
విశ్వదాభిరామ వినుర వేమ!

అన్న సత్యం విస్మరించకూడదు. భూత దయపట్ల వేమన్నకు ఎంతో గౌరవం వుంది. మనిషి సహజంగా మంచివాడే. ఆర్థిక, సామాజిక పరిస్థితులను బట్టి కఠినత్వం వహిస్తుంటాడు. అందువల్ల అతన్ని శిక్షించే బదులు, ఇలాంటి పరిస్థితులు రాకుండా చూడటం ముఖ్యమంటారు. వేమనలోని మానవత్వానికి, సోదర ప్రేమకు ఇంతకంటే నిదర్శనం ఏముంది?

చంపదగినయట్టి శత్రువు తనచేత
చిక్కెనేని, కీడు సేయరాదు
పొసగమేలుచేసి పొమ్మనుటేచాలు
విశ్వదాభిరామ వినురవేమ.

మానసిక పరివర్తనకు తోడ్పడే సంస్కరణల కోసం కృషిచేస్తున్న ఆధునిక సమాజానికి వేమన ఈ వాక్కు వేదం కావాలి.

ఈ విధంగా వేమన ప్రతిపద్యంలోను స్వానుభవం సామాజిక స్పృహ గోచరిస్తుంది. ఆయన సందేశాలు కాలం, ప్రాంతం అవధుల్ని దాటి, అన్ని వేళలా,అన్ని దేశాలలో వున్న ప్రజల శ్రేయస్సుకూ తోడ్పడుతాయి భౌతిక సదుపాయాలకు బానిసలమై, జీవితపు విలువలను మరిచిపోతున్న నేటి ప్రపంచానికి, వేమన్న వాక్కులు మేలుకొలుపు కావాలి. తెలుగు సాహిత్యం ప్రపంచ సాహిత్యం వున్నంతకాలం వేమన సజీవంగానే వుంటారు. తెలుగు గడ్డలో ఆయన పుట్టి, ప్రపంచమంతటా ఈ నాటికీ ఆయన జీవిస్తున్నారు.

"విశ్వైకవివి నీవు వేమన యోగీంద్ర
నిత్యసత్యమోయి నీదువాక్కు."

ఆయన మాటలను ఆచరించడమే నిజంగా మనం ఆయనకు చూపే గౌరవం.

(ఆకాశవాణి. హైదరాబాదు కేంద్ర ప్రసారితం)

ఇలాంటి కాంప్లికేటెడ్ కేసునాకు తగలడం ఇదేమొదటి సారి.

ఏదిఏమయినా సరళకు మంచిసంబంధం తేవాలని అహర్నిశలూ కృషిచేశాను. దసరా సెలవుల్లో వెతి కాను సంక్రాంతిసెలవుల్లో క్యాంపువేశాను. వేసవి సెలవుల్లో ఇంటిముఖం చూడకుండా తిరిగాను. కాని తగిన వరుడు తారసపడలేదు.

ఇలాగే మరో సంవత్సరం కాలప్రవాహంలో కలిసి పోయింది. హైదరాబాదులో తెలిసిన వాళ్ళతో పట్టు వదలని విక్రమార్కుడిలా ట్రై చేశాను.

చివరకు అన్ని హంగులున్న అబ్బాయి ఆపద్బాంధవుడిలా నాకు కనిపించాడు.

కష్టాలు గట్టెక్కాయనుకొని పెళ్ళి చూపుల తేదీ నిర్ణయించి ఉత్తరం వ్రాస్తానని చెప్పి వూరొచ్చాను

నా తలమీది కొండ దింపుకొన్నంత హాపీ ఫీలయ్యాను ప్రసిడెంటుగారి చెవిలో ఈ సువార్త చెప్పేసి కాస్త లీజర్‌గా ఇంటికెళ్దామని బస్సు దిగి తిన్నగా ప్రసిడెంట్ గారింటికి బయలుదేరాను'

ఖద్దరు బట్టలు ధరించి, గొడుగుచేతబట్టి వడివడిగా వస్తున్న రంగారెడ్డిగారిని చూడగానే పబ్లిక్ పరీక్షలో ఫస్టురాంకు తెచ్చిన అబ్బాయి తండ్రికి ఆ విషయం తెలియజేయాలని తహతహలాడే ఉపాధ్యాయుడి మనసులా, రెడ్డిగారికి సరిపక్ష సరళ సంబంధ విషయం వెంటనే చెప్పాలని వేగంగా నడిచి నమస్కారం పెట్టాను.

రెడ్డిగారు మాట్లాడలేదు సీరియస్‌గా నాకేసి చూస్తూ నిలబడ్డారు వాళ్ళ అమ్మాయికి సంబంధం చూడ్డంలో జరిగిన ఆలస్యమే వారి మౌనానికి కారణమని నేనే మాట్లాడ్డం మొదలుపెట్టాను.

'రెడ్డిగారూ మీ అంతస్తుకు తగ్గ సంబంధం తెచ్చాను. అబ్బాయి తండ్రి పి డబ్ల్యు.డి.లో అసిస్టెంటు ఇంజనీరు చేసి రిటైరయ్యాడు. అబ్బాయి తల్లి నీలోఫర్ హాస్పిటల్లో డాక్టరుచేసి రిటైరయింది. అబ్బాయి హైకోర్టులో లాయరు. అమ్మాయికి తగ్గ ఈడూజోడూ. అబ్బాయితోపాటు వాళ్ళ అమ్మా నాన్న మనవూర్లో వుండడానికి ఇష్టపడ్డారు. అమ్మగారి కోర్కెప్రకారం నర్సింగ్‌హోం ఓపెన్ చేయొచ్చు.ఇక మీ కాంట్రాక్టుల్లో కనకవర్షం కురిపిస్తుంది. రాంబాబు చూసుకోవలసిన కోర్టు వ్యవహారాలు అల్లుడు స్వయంగా చూస్తాడు. మీ ఇంటిల్లి పాదికీ నచ్చిన సంబంధం ఆలస్యం అమృతంవిషం. వెంటనే పెళ్ళిచూపులు ఏర్పాట్లు చూడండి అన్నాను.

ప్రెసిడెంటుగారు కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నారు.

జేబులోంచి మడచిపెట్టిన కాగితంతీసి నాచేతికిచ్చారు.

కాగితం మడతవిప్పి కళ్ళజోడు సవరించాను.

'పూజ్యులయిన తల్లిదండ్రులకు.

సరళ నమస్కరించి వ్రాయునది. వ్యక్తిగత స్వార్థంకోసం మీకు అనుకూలమైన అబ్బాయి అన్వేషణలో నా జీవితంలో ఇరవై ఐదేళ్ళు గడచిపోయాయి మీరు పెళ్ళిచేస్తారని కాచుక్కూచుంటే నాకు వృద్ధాప్యం వస్తుందని, నా జీవితం మీదు అవుతుందని భయంగా వుంది. పెళ్ళిచేసుకొని పిల్లా పాపతో హాయిగా వుండాలని ప్రతిస్త్రీ కోరుకొంటుంది. స్త్రీ సహజమైన ఆ కోరికతో మన పాలేరురంగన్నతో వెళుతున్నా. మా పెళ్లి ఏ గుళ్లోనో నిరాడంబరంగా జరిగిపోతుంది. ఒకే అబ్బాయి మెడిసిన్, ఇంజనీరింగ్ మరియు లా చదవడం వీలుపడదని అలాంటి సంబంధాల అన్వేషణ ఇక అవసరంలేదని మాస్టారుతో చెప్పండి. మీమనసు బాధ పెట్టినందులకు క్షమించండి.

ఇట్లు
మీ కూతురు,
సరళ.

నామనసు కరిగిపోయింది. కన్నీళ్ళతో కాగితం తడిసిపోయింది.

# సాహిత్యగోష్ఠి

## సమన్వయ మార్గమే శరణ్యం

సమాజం నిత్యంమార్పు చెందుతుంది. అదిదాని సహజలక్షణం. గత కాలపు అచారవ్యవహారాలు, కట్టుబాట్లు నేడు మనకు రుచించకపోవచ్చు. అలాగే నేడుండే సంప్రదాయాలు, భావాలు కూడా భవిష్యత్తులో పనికిరానివి కావచ్చు. సాహిత్యం సమాజానికి ప్రతిబింబం. సామాజిక వ్యవస్థ ప్రభావం సాహిత్యంపై నిత్యం వుంటుంది. సాహిత్యం సమాజాన్ని విడిచి ఆకాశపు దారుల్లో అయోమయంగా పరగెత్తదు. నేలవిడిచి సాముచెయ్యదు. రెంటికీవిడదీయరాని అవినాభావ సంబంధముంది.

సాహిత్యాన్ని, సమాజాన్ని వృక్షంతోపోల్చవచ్చు వృక్షం పాత ఆకుల్నిరాల్చి కొత్త చివుళ్లను తొడిగినట్లే సమాజం పాత ఆచారాలనువదలి కొత్త ఆచారాలను స్వీకరిస్తుంది. సాహిత్యం పాతభావాలను విసర్జించి కొత్త భావాలను పొదుగుకొంటుంది,

ఈనాడు కొందరు విమర్శకులు ప్రాచీన సాహిత్యాన్ని అభివృద్ధి నిరోధక సాహిత్యమనీ' జమీందారీ వ్యవస్థకు ప్రతిబింబమైన సాహిత్యమనీ' రాజాస్థానాలలో వారిదయా దాక్షిణ్యాలపై బ్రతికిన సాహిత్యమనీ విమర్శిస్తున్నారు అలాగే సంప్రదాయవాదులు నేటి ఆధునిక కవిత్వాన్ని నిరసిస్తున్నారు. వాక్యాల్ని విడగొట్టి, నానా చిత్రహింసలు అదే కవిత్వ మంటున్నారని సంప్రదాయ వాదుల విమర్శ వృత్తి, రీతి; గుణ, రస, పాక శయ్యాదు లేవీలేవని,ప్రాచీన లాక్షణికుల కొలమానాలతో ఆధునికసాహిత్యాన్ని కొలుస్తున్నారు. ఈవిధంగా వీరికి సమన్వయంలేక తెలుగు సాహిత్యాన్ని ఏటికొకరు, కాటికొకరు లాగుతున్నారు వీరిరువురి ఆలోచనా సరళి ఆరోగ్య వంతమైనది కాదు.

ప్రాచీన కవిత్వమంతా అభివృద్ధి నిరోధకమని తోసి వేయడం అనాలోచితం. సమాజ శ్రేయస్సుకే సాహిత్యం వుపయోగపడాలని నేడు మనం భావిస్తున్నట్లే ఆనాటి కవిత్వం నాటి సమాజానికెంతో ప్రయోజన కారి అయింది, సంస్కృతభాషలో వున్న పవిత్రగ్రంథాలను తెలుగు చెయ్యడం కూడదని నన్నయనాటి పండితులు భావించే వారు పంచమవేదమైన మహాభారతాన్ని నన్నయ సంస్కృత భాషనుంచి అనువదించడమే ఆనాటి గొప్ప సాహసం తెలుగు వారికి వైదిక మత ధర్మాలు బోధించి జైన, బౌద్ధ మతాల తాకిడి నుంచి హైందవ ధర్మాన్ని రక్షించాలనే దృక్పథం తోనే నన్నయ భారతాంధ్రీకరణం చేపట్టాడు.

తిక్కన భారతాంధ్రీకరణం సమాజశ్రేయస్సు నాశించే చేశాడు. ఆనాటి శైవ, వైష్ణవ మతాలు రెండూ పరస్పర వైషమ్యాలతో మత సహనం లేక విచ్చలవిడిగా ప్రవర్తించి సమాజ శ్రేయస్సుకు భంగం కలిగిస్తున్నాయి. ఇటువంటి పరిస్థితిలో తిక్కన హరిహరాద్వైతాన్ని ప్రతిపాదించి, మతసహనానికి దారిచూపి సమాజ శ్రేయస్సుకై కృషి చేశాడు. తిక్కన ఆనాటి అభ్యుదయ వాదే. సమాజ శ్రేయోభిలాషే

> "ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
> సరసమై పరగిన జానుతెనుంగు
> చర్చింపగా సర్వ సామాన్య మగుట
> కూర్చెద ద్విపదలు కోర్కిదైవార"

అని పాల్కురికి సోమనాథుడు నన్నయ ఏర్పరచిన మార్గ కవితాపద్ధతిని తిరస్కరించి దేశి కవితకు పట్టం కట్టాడు. జానుతెనుగును అభిమానించి ద్విపదరచన చేశాడు. అప్పటికది విప్లవాత్మకమైన నవ్య ప్రయోగమే.

రాయల యుగంలో వెలసిన ప్రబంధాలు కూడా అప్పటికి నవ్యమే. నూత్న దృక్పథంతో రచింప బడినవే. ఇంతటి అనంత వైవిధ్యమున్న ప్రాచీన కవిత్వాన్నంతా

అభివృద్ధి నిరోధక కవిత్వమని త్రోసివేయడం అనుచితం అసంగతం. ఆ కవిత్వంఆయాకాలాల కనుగుణంగానే ఆవిర్భవించింది. ఆ కవిత్వాన్ని దూషించేవారు, అభ్యుదయ కవిత్వమని చెప్పుకొనే నేటి కవిత్వాన్ని కూడా భవిష్యత్తు లోని వారు నిరసించవచ్చుననే విషయం గుర్తించడం మంచిది. అందుకే పరస్పర అవగాహనమవసరం. ప్రాచీనాధునిక కవిత్వాలపట్ల సమన్వయ దృష్టి వుండడం మంచిది.

ఏదైనా హఠాత్తుగా సంభవింపదు. గాలిలో పుట్టదు. పాతలేనిదే కొత్తరాదు. పునాది లేనిదే భవనం నిలవదు. కొత్తదనానికి పాతదనం పునాదవుతుంది. ప్రాచీన కవిత్వం నవీన కవిత్వానికి పునాది అయినప్పుడే మంచి కవిత్వం ఆవిర్భవిస్తుంది. ఈ విషయాన్ని కవులు, విమర్శకులు గుర్తించడం ఎంతైన అవసరం.

"మంచిగతమున కొంచెమేనోయ్" అని గురజాడ వారు చెప్పినా

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెఱుంగులు జిమ్మగా"

అని గురజాడ వారు కొత్త పాతలమేలు కలయికను వాంఛించారు. కొత్త పాతలు ఏదో కలగాపులగంగా కలవడం గాదు. మేలు కలయిక కావాలి. అప్పుడే క్రొమ్మెరుంగులు జిమ్మే అభినవ కవిత ఆవిర్భవిస్తుంది. ఇదీ ఆయన దృక్పథం.

ప్రాచీన కవిత్వాన్ని నిరసించే వారు ఒక్కసారి శ్రీ.శ్రీ కవిత్వం లోని సంప్రదాయాన్ని గమనిస్తే వారి ఆలోచనా ధోరణి అంతమొందుతుంది. శ్రీ శ్రీ.గేయాలపై మనుచరిత్ర, వసుచరిత్రల్లోని ఆశ్వాసాంత పద్యాల ప్రభావమెంతుందో డా॥ సి. నారాయణరెడ్డి గారు తమ 'ఆధునికాంధ్ర కవిత్వం లో వివరించారు. "హోమజ్వాలల భుగభుగలు' త్రేతాగ్ని, హరోం హరోం హర హర హర హర హర! నటధూర్జటి నిటలాక్షి పగిలిందట, యముని మహిషపులోహఘంటలు మబ్బుచాటున ఖణేల్ మన్నాయి, నేను సైతం ప్రపంచానికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను, జగన్నాధుని రథ చక్రాల్' నావాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పరిచుంబనలో ఇత్యాది ప్రయోగాల్లో సంప్రదాయ బలమెంతగా వుందో చెప్పనక్కర లేదు.

సంప్రదాయానికి హారతి పట్టిన విశ్వనాథ వారు కూడా "కిన్నెరసాని పాటలు, గిరికుమారుని ప్రేమగీతాలు" రచించి నవ్యులనిపించుకొన్నారు.

ఆధునిక కవిత్వాన్ని ఈసడించే సంప్రదాయవాదులు కూడా సామాజిక మార్పులను, తదనుగుణంగా జరిగే సాహిత్యరచనలను గూడా గౌరవించాలి.

"కాలమును బట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి దేశభాషాలలితాంగి మారుటది సత్కవి సమ్మతమౌట" అనే తిరుపతి వేంకటకవుల మాటలు ప్రత్యక్షర సత్యం.

ప్రాచీనాధునిక కవిత్వాలలో దేన్నీ నిరసించక సమన్వయ దృక్పథాన్ని విమర్శకులు అలవరచుకోవాలి. రెంటి లో మంచిని గ్రహించి స్వీకరించాలి. అదేసాహిత్య ప్రగతి. విమర్శకులకు సుగతి.

చాగంరెడ్డి నరసింహారెడ్డి ఎం. ఏ.

# 'చదువు'లో చిత్రితమైన సామాజిక సమస్యలు

కొడవటి గంటి కుటుంబరావు చక్కని సామాజిక దృక్పథం కలవాడు వాస్తవిక వాది ఇతనిలో కొట్టవచ్చి నట్లు కనిపించేది నిజాయితి తనకు పరిచయం అయిన వాతావరణాన్ని, తన అనుభవ పరిధిలోకి వచ్చిన పాత్రలను మాత్రమే వర్ణిస్తాడు. ఇతనిని తెలుగులో అతి నిరాడంబర కవిగా పేర్కొన వచ్చును. సామాజిక వాది అయిన ఈతని రచన లోఅనేక సమస్యల యొక్క విమర్శనము, విచికిత్స ఉంటాయి.

'చదువు' నవలలో 1910 నుండి 1935 వరకు దేశంలో జరిగిన సామాజిక రాజకీయ సంఘటనలను వాటి పరిష్కార మార్గములను అనేక పాత్రల ద్వారా చూపినాడు సమాజంలోని ప్రాచీన సంప్రదాయాలను అంటి పెట్టుకొని యున్న వారికి ఉదాహరణముగా సుబ్బమ్మ, సీతమ్మ పాత్రలు, తాను కోరే మార్పుకు అనుగుణముగా శేషగిరి, సుందరం పాత్రలను కుటుంబరావు గారు తీర్చిదిద్దినాడు.

కొడవటిగంటి గారు మార్క్సిజంను చక్కగా అర్థం చేసుకున్నవాడు. అందుకే సమాజం లేనిదే వ్యక్తి లేడు అన్న మార్క్సిజం సిద్ధాంతాన్ని ఈ నవలలో విస్తృతముగా వివరించినాడు. ఒంటరిగా తిరిగే సుందరంను గురించి తండ్రి 'అందరి పిల్లలు మేష్టర్ దగ్గర, పుస్తకాల్లోను నేర్చుకొనే దాని కన్న తోటి పిల్లల దగ్గర ఎక్కువగా నేర్చుకుంటారు.' అని అంటాడు. మొదట్లో ఏమీ ఎఱుగని సుందరం వెంకటప్పయ్య, లక్ష్మయ్య, సుబ్బులతో స్నేహం చేసి ఎన్నో క్రొత్త విషయములు తెలుసుకుంటాడు ఇక్కడ సమాజము యొక్క ప్రాముఖ్యాన్ని సూచిస్తున్నాడు.

సమాజంలో మారుతున్న విలువలకు, మారని విలువలకు మధ్య సంఘర్షణను ఇందు గమనింప వచ్చును. మారని విలువలకు ప్రతినిధియైన సీతమ్మ "శ్రీమన్నారాయణ విస్తరిహీనం వస్త్రహీనం పనికి రాదనేవాడు! అతడున్నప్పుడు ఎంత దర్జాగా బ్రతికాడు అని అంటుంది. మారుతున్న విలువలకు ప్రతినిధియైన శేషగిరి ఆమెతో ఇలా అంటాడు. పూర్వపు జ్ఞాపకాలు మననము చేస్తే లాభము లేదు కాలానుగుణముగా మారాలి. ఆనాడు సొమ్ములు పెట్టుకునేవారు. కాని ఈనాడు అట్లా డబ్బును మెడలో పెట్టుకొని వృథా చేయకూడదు అందుకే నన్నడిగితే నీ నగలన్ని అమ్మేసి అది డబ్బు చేసి బాంకులో వేసుకో కాస్త వడ్డి అన్నా వస్తుంది నీకు ఇతరులకు లాభం అని మందలిస్తాడు. గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్, అని సంప్రదాయాలను పట్టుకొని ప్రాకులాడే సీతమ్మ లాంటి వ్యక్తులను, సమాజంలో మార్పు రావాలని స్వాతంత్రోద్యమంలో తిరుగుతు అపుడపుడే నేర్చుకొంటున్న శేషగిరి లాంటి వ్యక్తులును 1910 కాలం నాటి సమాజంలో గలరు

కుల మత భేదాల వల్ల సమాజంలోని వ్యక్తుల లో సంకుచితత్వము, పరస్పర సంఘర్షణలు మున్నగు అనే కనర్థాలు ఏలా యేర్పడుతాయో అనేకమంది కవుల వర్ణించియున్నారు. 'చదువు' లో కూడ ఈ సమస్యను వివరించియున్నాడు. శివయ్య అనే మేదరి వాడు సుందరం ఇంట్లో ఒక అప్పడం తిన్న తర్వాత మంచి నీళ్ల గ్లాసుతో ఇవ్వమంటే సీతమ్మ 'ఆ అబ్బాయి సూద్దరాడు కాదూ?' కరచుకు తాగటానికివ్వను అంటుంది అపుడు సుదరం తన మనస్సులో చాలా బాధ పడుతాడు ఇంకా క్లాసులో తనతో సమానంగా ఉండేవాణ్ణి ఇతర విషయాలలో కూడ సమానంగా చూడకూడదా! అని ఆలోచిస్తాడు. ఇచ్చట ఆనాడు సమాజం లో పాతుకు పోయిన కుల మత భేదాలను సీతమ్మ మాటలలో చూపి, సుందరం మాటల లో కుల మత రహిత సమాజం కావాలి, సర్వసమానత్వ భావన ముఖ్యం, సంఘంలో సంస్కరణలు అవసరం అన్న భావాలను చూపుతాడు.

సామాజిక వాస్తవ చిత్రణ కంటె సామాజిక స్పృహను చిత్రించిన వారు గొప్ప రచయితలు. సమాజంలో జరుగుతున్న సంఘటనలను వర్ణించుట మాత్రమే సామాజిక వాస్తవికతకాగా, ఆ సమస్యలను వర్ణించుచు వాటికి పరిష్కార మార్గములు చూపునవి సామాజిక స్పృహ గల రచనలు. రెండవ లక్షణము ఈ రచయితలో గమనింప వచ్చును.

వీరేశలింగం గారి సంస్కరణోద్యమ ప్రభావం సంఘం లో బహుళ వ్యాప్తి నొందిన కాలం లో వ్రాయబడినది ఈ నవల దీని ప్రభావం ఇందు కనబడుతుంది. ఈ రచయిత కూడ సహజముగా సంస్కరణము కోరే వాడగుటచే వివాహ వ్యవస్థలోని అనర్థాలను వివరిస్తాడు. శేషగిరి బాల్యవివాహాలు, దిక్కుమాలిన ఆచారాలు మానాలి అంటాడు. అపుడు సీతమ్మ 'చక్కగా చిన్నపుడే పెళ్ళి చెయ్యటానికేమి? బ్రెలల్లే ఇరవై యేళ్ళ పిల్లల్ని పల్లకిలో ఎక్కించి, ఊరేగిస్తారా! అచ్చటా ముచ్చట ఉండొద్దు' అని అంటుంది. వెంటనే 'అదే వచ్చింది! పిల్లల జీవితాలతో మనం బొమ్మలాడుతున్నాం' అని విమర్శిస్తాడు.

వితంతు వివాహాల గురించి ఇలా వివరిస్తాడు. 'విధవల వివాహాలను కూడ చేయిస్తున్నావట గదా!' అని సీతమ్మ అన్నపుడు శేషగిరి నాదేమిటి నా తలదన్నిన వాళ్ళు చేయిస్తున్నారు. ఉన్నవ, సాంబశివరావు మొదలయిన వారు చేయిస్తున్నారు. స్త్రీ పునర్వివాహములు చూడు ఎంత అవసరమైన సంస్కరణో! అందుకే రచయిత శకుంతల రెండవ పెండ్లి చేసుకున్నట్లు వివరిస్తాడు. కాని ఆమె ఎంత బాధ పడుతుందో చూస్తే, సమాజంలో విధవలు రెండవ పెండ్లి చేసుకోవడం ఆనాడు ఎంత ఘోరముగా నుండునో తెలుస్తుంది. ఇంకా వరకట్న సమస్యనుచూపుతాడు సీతమ్మ పార్వతమ్మ దగ్గర వెయ్యి నూటపదహార్లు అడిగినపుడు సుందరం తమ కళ్ళ ఎదుటే మానవత్వానికి ఘోర పరాజయం జరిగిందని తలపోస్తాడు.

స్త్రీలకు, ఆనాడు ఈనాడు ఏనాడైనా సమానమైన హక్కులు పురుషులతో లేవనియే చెప్పాలి. వీటికై సంఘంలో ఏన్నో ఉద్యమాలు, సంస్కరణములు లేవ నెత్తినారు కుటుంబరావు గారు స్త్రీపురుషులకు సమాజంలోను, వివాహంలోను సమానహక్కులు ఉండాలంటాడు. స్త్రీలు ఎంత సంకుచితంగా చూడ బడుతున్నారో సుందరంతో ఇలా అని పిసాడు 'ఆడపిల్లలకు ఏడో ఏట పెళ్ళిళ్లు చేసుంటే మగవాళ్ళకు మటుకు ఏపాటి కేళ్ళకో చేసారా?' 'ఈ దిక్కుమాలిన సంఘంలో పన్నెండేళ్ళకే పెద్దవాళ్ళు. అపుడే గర్భాదానాలు, ఎపుడు వంట యిల్లు కూరగాయల గురించే మాటలు' అనీ ఛీదరించుకుంటాడు.

ఈ నవల యందు సుందరం ప్రధాన పాత్ర సుందరం లోని జీవితము క్రమ క్రమముగా ఎదిగినపుడు అతని మనస్సు మారిన విధానమును రచయిత చక్కగా ఒక స్నేహితునికి చెపుతున్నట్లు చెపుతూనే సంఘాన్ని, పట్టి పీడిస్తున్న అనేక సాంఘిక సమస్యలను మనకు చూపుతున్నాడు. అందుకే నాగభూషణ శర్మగారు" ఒకహృదయం ఉన్న వ్యక్తి తన జీవిత భావాలను మనకు చెపుతున్నట్లుగా ఉంటాయి. ఈతని నవలలు. ఈతనిరచనా శిల్పాన్ని ప్రత్యక్ష వాఖ్యాన పద్ధతి అనవచ్చు'' అని అన్నారు.

చివరికి మొత్తం సమాజమే మారాలంటాడు 'సంఘంలో నున్న ఆచారాలన్ని తప్పే. సంఘానికి లొంగి జీవితాల్లు గడిపే వాళ్ళంతా అసమర్థులే. సాంఘిక నియమాలేవీ ఉన్డకూడదు. ఈ కులాలు, ధర్మాలు, ఆచారాలు పోవాలి వ్యక్తులు తమ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించ టానికి వీలుండాలి'' అని సమాసం ఎలా ఉండాలో తన అభిప్రాయమును తెలుపుచు ఈనాటి సమాజం ఎలా ఉందో చూపాడు

ఈ విధంగా రచయిత సామాజిక వాతావరణం లోని అస్పృశ్యతను, వరకట్న దురాచారమును, విద్యావిధానమును స్త్రీపురుషుల సమాన స్వేచ్చను, స్వాతంత్ర్యమునకై జరుగు పోరాట పరిస్థితులను ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించి సమాజం సంస్కరింప బడవలెననియు, అప్పటికే వీరేశలింగం మున్నగు వారి ప్రభావం వలన సంస్కరింప బడిన కొన్ని సని లవేషములను ఉదాహరణములుగా వివరించి "The novel's success lies in its oun sensitiveness, not in the success of its subject matter" అన్న forster మాటలకు సరిపడునట్లుగా 'చదువు' నవలను తీర్చిదిద్దినాడు.

యల్లంభట్ల నాగయ్య ఎం. ఎ.

# 'ఋషి' - ఒక పరిశీలన

మానవ చరిత్ర అంతా వ్యక్తుల మధ్యఘర్షణే, పరస్పర సంచనల పట్టికే! స్వార్థం కోసం మనిషి మనిషికి చేసే ద్రోహం, వంచన– ఇది ఏవో ప్రభుత్వ విధానాల వలన మారవు. ఆర్థిక' రాజకీయ విధానాల వలన, సాంఘిక నియమాల ద్వారా అవినీతిని అరికట్టడం సులభం కాదు అసలు ఇటువంటి వంచనలతోను ద్రోహ చింతినలతోను కలుషితమైన నేటి సామాజిక వాతావరణంలో జీవితం పట్ల శ్రద్ధను, అకర్షణను కోల్పోతున్న సామాన్య మానవుడికి రాజకీయ నినాదాలు. వుద్యమాలు ఏమాత్రం తృప్తిని యివ్వలేవు. కేవలం ఆత్మ పరిశీలన. మానసిక పరివర్తన ద్వారానే మార్పు రావాలి. మనిషిలోని సుప్త చైతన్యాన్ని జాగృతం చేసి సకల మానవశ్రేయస్సుకు బాటలు వేయడం తనకుగల బాధ్యతను గుర్తించ గలగటంకేవలం ఆధ్యాత్మిక స్పృహ వున్న రచయితకే సాధ్యం. చిత్తశుద్ధి. సత్యాన్వేషణఆ రచయితకు వుండేముఖ్య లక్షణాలు తన అనుభవాల ద్వారా. చిత్తశుద్ధితో ప్రజ్వలిత జిజ్ఞాసతో, సునిశిత దృష్టితో, సున్నిత హృదయంతో వారి పొగడ్తలకు తెగడ్తలకు బలి కాకుండా నిరంతరం సాగించే అన్వేషణలో అతడికి జీవిత సత్యం అవగతమవుతుంది. ఆధ్యాత్మిక దృక్పథం అలవడుతుంది ఇరవయ్యవ శతాబ్దంలో చలం గోపీచంద్ బుచ్చిబాబులను ఇటువంటి ఆధ్యాత్మిక దృష్టి వున్న రచయితలుగా చెప్పుకుంటాం 'ఋషి, రచనలో వారి స్థాయికి చేరుకున్న వ్యక్తి శ్రీ యండమూరి వీరేంద్రనాథ్

'ఋషి, ఒక మధ్యతరగతి యువకుడిని (ప్రకాశం సంబంధించిన కథ మిగతా పాత్రలు అతడి జీవితంలోకి ఏదో విధంగా ప్రవేశించి, అతిడి పై తమ ప్రభావాన్ని మంచిగాని, చెడుగాని—చూపించి తిప్పుకుంటాయి. అటువంటి పరిస్థితుల. పరిచయాలమధ్య, నిత్యం ఎదురయ్యే సమస్యల మధ్య మానసిక ఘర్షణకు లోనయినా, ఆ అనుభవాలలో. అనుభూతులలో క్రమంగా ఎదిగిపోతూ చివరకు వాస్తవిక పరిస్థితులతో సమన్వయం సాధించలేక మానసికంగా పతనమయిన వ్యక్తి జీవితాన్ని స్ట్రీమ్ అఫ్ కాన్షస్ నెస్ పద్ధతిలో వివరించిన నవల ఋషి. అయితే. కథను ఆత్మ విశ్లేషణాత్మక శైలిలో మొదలు పెట్టి అదే శైలిలో ముగిస్తూ రచయిత తన అస్తిత్వవాద సిద్ధాంతాన్ని పాఠకుల

ముందుంచారు.రచయితలోని జిజ్ఞాస రెండురకాలుగా స్పష్టం అవుతుంది ఒకటి సంఘ పరమైనది అంటే, సమాజంలో సగటు మనిషిగా ప్రకాశం అనుభవాలు, సమస్యలు ఎటువంటివి అన్నది. రెండవది స్త్రీ పురుష బాంధవ్యానికి సంబంధించినది -వ్యక్తిగా ప్రకాశం స్వభావం అతడి అంతరంగిక జీవితం ఎటువంటిది అన్నది.

మనిషి స్వార్థపరుడే! తన సుఖం, తన సంతోషం కోసమే అతడు పాటుపడేది. ఈప్రయత్నంలో అతడెంత కృతకృత్యుడయితే అతడి సాటిమనిషి అంతగా పీడింప బడతాడు. నిత్యావసరాల పూర్తి కోసం, సదా సమాజంలో వున్నత స్థాయిని సంపాదించుకోవాలనే తృష్ణలో ఎటువంటి పనినైనా చేయటానికి వెనుకాడని మనిషిలో మార్పు రావాలీ అంటే వ్యవస్థ మారాలి. పరిస్థితులు మారాలి. కాని మారవు! ఆమార్పు రాక పోవటానికి కారణం ప్రభుత్వ విధానం. అమ్యూజిమెంట్ పార్కుల వల్ల మనిషి నైతికంగా ఎంత పతనమయ్యే ఆస్కారముందో తెలిసి వాటికి లైసెన్స్ నిస్తుంది ప్రభుత్వం. "ఇలాంటి విషయాల్లో గవర్నమెంటు చాల అందంగా ఆత్మవంచన చేసుకు టుంది లెండి'' అంటాడు ప్రకాశం తో గోపాలస్వామి 'అలా ఆత్మవంచన చేసుకోక పోతే లాటరీలను, క్యాబరేలను, రేసుల్ని ఆపు చెయ్యాలి. కాని చెయ్యదు. ప్రజలెంత ఎస్కేపిస్టులయితే అంత మంచిది. నిత్య జీవిన సమస్యలతో అసంతృప్తితో దిగిపోయే సామాన్యులకి తాత్కాలికంగానే అయినా ఉపశమనం కలిగించే సాధనాలు ఇవే! అలా సమస్యల నుంచి పారిపోవటానికి అలవాటు పడిన వ్యక్తి తిరగబడడు. సమస్యను ఎలాదాచేయాలా అనిమాత్రమే ఆలోచిస్తాడు మాణిక్యాలరావు వంటి వారు మాత్రం తమతెలివి తేటల్ని ఆలోచనల్ని యితరులని మోసం చేసి డబ్బు సంపాదించడానికి వినియోగిస్తారు. వీరి మధ్యే నిజాయితీగా శక్తికొద్దీ రాత్రి పగలు శ్రమపడే ఇస్మాయిల్ లాంటి వారూ వున్నారు. అయితే 'వారిలో ఆనిజాయితీ ఎంతకాలం నిలచి వుంటుంది? అన్నది ప్రశ్న! "మన జీవితాల్లో డబ్బు యింతగా ముడిపడిన ఈ వ్యవస్థలో డబ్బు నిజాయితిని పరిక్షిస్తూనే వుంటుంది-'' అంటారు రచయిత. తనకంటే వున్నత స్థాయిలో వున్న వ్యక్తితోతన స్థితిని పోల్చుకున్నప్పుడు కలిగే ఈర్ష్య ఒక వైపు, డబ్బు ఎరగా చూపించి తమ తమ పన్లు జరిపించు కోవాలని చూసే మనుషులు మరో వైపు సామాన్యుడి మనస్సును ఆతలా కుతలం చేసాయి. ఇలా ప్రిన్సిపల్స్ అనే కట్టుబాట్ల మధ్య నలిగి పోతు , ఆకలి బాధతో సతమత మయ్యే వ్యక్తికి నైతిక విలువల పట్ల నమ్మకం సడలి పోవడం సమాజం అది అతడి తప్పు కాదు. పరిస్థితులే అందుకు కారణం. ఈరకంగా వ్యక్తి ఆలోచనలు ఆదర్శాలు అతడి చుట్టువున్న సామాజిక వాతావరణం మీద ఆధారపడి వుంటాయన్న మార్క్సవాద దృక్పధంతో నేటి సమాజాన్ని విశ్లేషిస్తూ తన సిద్ధాంతాన్ని రచయిత మన ముందుంచుతారు– "మనిషి పాడవకుండా వుండటానికి కారణం అతడి బలమైన వ్యక్తిత్వమే అయివుండనక్కర లేదు పిరికితనం కూడా అతడిని చెదిరి పోకుండా కాపాడుతుంది" అనీ, అమాయకుడైనా, చెడిపోయిన వాడయినా సరే– తను నమ్మిన సిద్ధాంతాల పట్ల స్థిరంగా నిలబడే వాడు గొప్పవాడు. అని!

"The idcological and artistic innovations of the art ofsocialist real-ism have a firm philosophical ground ing" (Marxist leninist Aesthetics and life- Art and the philosophical principle of Humamism- tramslated by Markov.) అన్నది ఈ రచన ద్వారా ధృవపడుతుంది. మరో రకంగా చెప్పాలంటే సమాజ శ్రేయస్సును దృష్టి లో వుంచుకుని ప్రతి వ్యక్తి తన వ్యక్తిగత స్వేచ్ఛను కాపాడు కోవాలి అన్న తృష్ణ–కాంట్ లో నూ వున్న ఆ తృష్ణే– quest for the freedom of man- ఈ రచయిత లో నూ స్పష్టం అవుతుంది. ఆ స్వాతంత్ర్య పిపాసే మనిషి జీవితానికి–అస్తిత్వానికి అర్థం చెబుతుంది. అయితే వ్యక్తి కొన్ని విషయాల పట్ల కొందరు వ్యక్తుల పట్ల ఏర్పరచుకునే అభిరుచులు– అభిప్రాయాలు ఆయా విషయాల పట్లగాని, వ్యక్తుల పట్లగాని వారికి వున్న ఆసక్తిని, ఇష్టాన్ని వ్యక్తం చేస్తాయి. ఇష్టాయిష్టాలకు అంతఃకరణ ప్రేరేపణలకు ఎంతో తేడా వుంది. అది గుర్తించడం ఎంతైనాఅవసరం. ముందుగా ఆచర్చలోపడకుండా అస్తిత్వవాదానికి సంబంధించిన కథాంశాన్ని తెలుసుకోవటం ముఖ్యం.

ప్రకాశం వ్యక్తిగత జీవితంపై ముద్రవేసే ముఖ్యమైన పాత్రలు– కుమార్, సుజాతలు. కుమార్ ఒక చార్టర్డ్ అకౌంటెంట్. డబ్బుకి కొదవలేదు. కావలనుకున్నది పొంద

గల చాకచక్యం; అవకాశం వున్న వ్యక్తి! కాని ప్రకాశం దృష్టిలో అన్నీ వున్నా ఏమీలేని స్థితి అతడిది. తల్లిదండ్రుల స్వభావం, వారి ప్రవర్తన అతడిలో ఒక విధమైన కసిని నింపుతాయి. అతడి చుట్టువున్న మనుషులు వారిమనస్తత్వాలు అతడిలోని అసంతృప్తిని మరింత ఎక్కువ చేస్తాయి. ఆ సంతృప్తి అతడిని చెడువైపు మొగ్గాలా చేసినా అవి అలవాటుగా మారవు కాని, అనుభవం నుంచి కూడా పడే తృప్తిని సంతోషాన్ని పొందాలన్న తపన ఎక్కువ అవుతుంది

సుజాత ప్రకాశానికి బి.ఏ. క్లాస్మేట్. అందగత్తె! ఆ రోజుల్లో ప్రకాశం ఆమె వైపు ఆకర్షితుడయినా ఆమెను మాట్లాడించే ప్రయత్నంకూడా అతడెప్పుడూ చేయలేదు. దాదాపు మూడు సంవత్సరాల తర్వాత యాదృచ్ఛికంగా కలుసుకున్నప్పుడు అన్ని నాళ్ళుగా మనసులోనే దాచుకున్న అతడిపైన ఇష్టాన్ని వ్యక్తం చేస్తుంది. సీతను(మరదలు) పెళ్ళాడ వలసిన బాధ్యత నా మీద వుండగా నిన్నెలా ప్రేమించగలను?'' అని తప్పించుకునే ప్రకాశానికి సుజాత యిచ్చే సమాధానం — మన మధ్య ప్రేమ అనేటంత పెద్ద పదం ఎందుకులే? అని ఆమె నిజాయితీ ముందుప్రకాశానికి మొదటిసారిగా తన నిర్ణయంలోనూ ప్రవర్తనలోనూ వున్నలోటు తెలిసి వసుంది. నైతిక నియమాలతో కట్టిపడ వేయబడిన జీవితాన్ని, తన చుట్టూ తను ఏర్పరచుకున్న వాతావరణాన్ని విశ్లేషి-చే శక్తి లేని ప్రకాశం చెడిపోవటం యిష్టం లేక ఆమెను తృణీకరించ గలిగినా ఆమె తనతో యింకా మాట్లాడుతేబావుణ్ణని ఇంకొంచెం బ్రతిమిలాడితే బాగుండుననే బలహీనతను జయించ లేక పోతాడు. ఒక సందర్భంలో అతడు అనుకుంటాడు — "చెడిపోవటం చేతలకు సంబంధించినది అయితే పర్లేదు మనసుకు సంబంధించినది అయితే తనపట్లే చెడిపోయేదు అని ఆమె సమక్షంలో తనలో కలిగిన సంచలనాన్ని వ్యక్తం చేయలేక మనసులోనే దాచకో లేక సత మత మయినా 'తనని గురించి తను నిజాయితీగా ఆలోచించడానికి ప్రకాశానికి భయం వేసింది. ఇలా తను మానసికంగా దిగజారినా తన మీద తనకు కలిగిన కసి అసహ్యం నైతిక విలువలను పాటించని సుజాత— కుమార్ల మీదా కలుగుతాయి. తన గురించి తన వునికిని గురించి తను ఎర్పరచుకున్న నైతిక వ్యవస్థ గురించి తార్కికంగా ఆలోచించే శక్తి లేక తల్లడిల్లిపోతాడు— "ఎదుటి వ్యక్తుల మనస్సులో ఆలోచనల్నన్నీ చదవగలిగే ఒక భూతద్దమేదు నా కిస్తే ఇంత— కల్మషాన్ని, నీచాన్నీ చూడలేక ఆత్మహత్య చేసుకోవడం ఖాయం. బ్రతకటం ఎందుకు? ఈ వ్యసనాలు, రోదనలు— నీరవ నిశీధిలో శ్మశానంలో ఒక మూల, ఉవ్వెత్తున లేచే మంటల మధ్య తటాలున పగిలే కపాలం — దట్టమైన అడవిలో ఒక రెమ్మ నుంచి రాలే గడ్డి పువ్వు, సముద్ర గర్భంలో చచ్చిపోయిన చేపల్లా — ఏది మిగిలేది చివరకి— —ప్రశ్నే— సమాధానం లేదు దొరకదు. ఎందుకీ వ్యధ?"అనుకుంటాడు దేనికి'' సమాధానం ఫ్రాయడ్ మనో వైజ్ఞానిక సిద్ధాంతాలు అస్తిత్వవాదుల తత్వాన్వేషణలు చేస్తాయి— నైతిక విలువలు నిర్ణయం నిరంతరం పరివర్తన చెందే సామాజిక పరిస్థితుల పైన, బహుజనాభిప్రాయం మీద ఆధారపడి వుంటుంది అన్న సాధారణ జనాభిప్రాయాన్ని స్వీకరించడం వల్లనే అని! కాని వ్యక్తి ఒక్కోసారి తను చేసే పనిని సాధారణ ప్రజానీకం సమర్థించదని తెలిసినా తన అంతఃకరణ ప్రేరేపించిన రీతిగనే నడుచుకుంటాడు (దబ్ల్యు లిల్లీ) అంటే యిక్కడి అతడి నిర్ణయాన్ని సమర్థిస్తున్నది అల్ప సంఖ్యాకులా అధిక సంఖ్యాకులా అన్నది ముఖ్యం కాదు. ఇక్కడ ప్రాముఖ్యత వ్యక్తి అంతరంగిక అనుభూతికి అనుభూతిని సక్రమంగా అర్థం చేసుకున్న వ్యక్తి ఎటువంటి ఘర్షణ లేకుండా తనకు కావలసిది తాను సంపాదించుకుంటాడు తాను స్వతంత్ర్యాన్ని కాపాడుకుంటేనే సమాజ శ్రేయస్సునును దృష్టిలో వుచుకుని తన బ్రతుకును నిజాయితీగా బ్రతికేప్రయత్నం చేస్తాడు అతడే అసలయిన అస్తిత్వవాది.

ప్రకాశం తత్వం అందుకు పూర్తి వ్యతిరేకం. నాకేదీ ప్రత్యేకమైన వ్యక్తిత్వం లేదు నేను చాలా సామాన్యమైన మనిషిని అనుకునే వాడే నిజమైన ఋషి అని తెలియక మనిషిని నైతికంగా కట్టిపడవేసే ధర్మమాత్రపు పరిధిని అగౌరవ పర్చలేని సగటుమనిషి గా మిగిలిపోతాడు ప్రకాశం.

ఈ రకంగా తనను గుర్తించలేక, నైతిక మర్యాదలను కట్టుబాట్లను అతిక్రమించలేక త్యాగాల పేరిట, ఆదర్శాల పేరిట ఆత్మవంచన చేసుకునే ప్రకాశం లాంటి వారికి తనలోని బలహీనతలను పదుగురి ముందు ఒప్పుకునే ధైర్యం లేక చాటుమాటు వ్యవహారాలు సాగించే పరంధామయ్య లాంటి వారికి కనువిప్పు కలిగించడమే 'ఋషి, రచయిత ధ్యేయం.

**డా. జి. ఉషాలావణ్య**




# సందేశ సప్తశతి

రచన- 'తెలుగు వెంక' తుమ్మల సీతారామమూర్తి
వెల : రూ. 5-00
ప్రతులకు - రచయితపేర, అప్పికట్ల-గుంటూరు జిల్లా.

మహాకవి తుమ్మల సీతారామమ్మూర్తి గారు అభినవ తిక్కనగా విఖ్యాతినంది, తెనుగు లెంకగా వినయ భూషణులైనారు. వారి పద్యరచన హృద్యమూ, అనపద్యమూను తుమ్మలవారు ఏది వ్రాసినా సామాజిక దృష్టితోనే వ్రాస్తారు. ఈ కావ్యంకూడా ఆదేలక్ష్యంతో సంతరించ బడినది.

ఈ కావ్యంలో ఏడువందల పద్యాలు సంకలనం చేయబడినాయి. పద్యాలన్నీ ఆటవెలది తేటగీతి కంద పద్యాలే. ప్రతిపద్యం మానవ సమాజానికి ఏదో ఒక సందేశాన్ని అందిస్తూనే ఉంటుంది. సమాజంలో పెచ్చు పెరిగి విచ్చల విడిగా విహరిస్తున్న అన్యాయాలనూ, అక్రమాలనూ నిరసించే భావాలు ఈ కృతిలో ఆకృతి పొందాయి.

"చిత్తశుద్ధి కరుణ సేవా సమాసక్తివలయు వైద్య వృత్తి వలచువారికి"

"రుగ్గెనందు నీశ్వరుని జూడజాలిన తెలివిగన్న వెజ్జు గెలుపునందు"

అంటూ కవి డాక్టర్లకు ఉత్తమ సందేశాన్ని అందించారు. వరకట్న దురాచారాన్ని ఇట్లా నిరశిస్తున్నారు.

వేయితెచ్చునతం డిరువేలుతెచ్చు
బోటినొల్లడు కట్నాల మూటలేక
యాడుదవమున నిదిశిక్షయా కఠోర
ఘోరజాతీయ దురితమీ కుటిలకాంక్ష)

ప్రతివ్యక్తి ఆచరణలో పెట్టదగిన మంచి సంగతు లెన్నో ఈ కావ్యంలో ఉన్నాయి. ఉదాహరణకు కొన్ని చూపబడుతున్నాయి.

'గుడిగాదు నేడు నరునకు
బడిగావలె మూఢమైన ప్రత్యయములపో
బడిగావలె యుగయుగముల
గడల్కొనిన తమముతీరు గడకావలయున్'

'ఎంతపెద్ద గద్దె కెక్కెదవోయంత
డాబులేనిమన్నదన్ వరింపు'

"గంజిలోనికుప్పు గల్లులేదిపుడని
కుందువాని నాను కొండుదొరలు"

'మిద్దెవాడునాల్గు మేడలవాడాయె
గుడిసెవాడుపోయె గుట్టకడకు'

ఈ విధంగా ఎన్నో చక్కని సందేశాల సందోహాన్ని సంఘటించి కృతి గూర్చిన తుమ్మలవారు తెలుగువారికృతజ్ఞతలకు పాత్రులైనారు.

## స్పందన

(కవితా సంకలనం)
రచన:- మునికొండ ఈశ్వరచరణ్
మాదాడి నారాయణరెడ్డి
ముదిగొండ వీరేశలింగం
వెల రూ. 3-00
ప్రతులకు- కిరణ్ ప్రింటర్స్, సిద్ధిపేట-502103
మెదకుజిల్లా

నేటి సమాజంలో నిత్యంటిల్లే చర్యలకు అనుస్పందించిన గుండెలతో కూర్చిన స్పందన ఇది. ఇందులోని వచన కవితలను సంతరించిన ముగ్గురు కవులు కళాశాల అధ్యాపకులు. భావుకులు, సాహిత్య తత్త్వాన్ని బాగుగా ఆకళించు కొన్నవారు. కనుకనే వీరి కవితల్లో మంచిభావ సంపద కనబడుతుంది

'స్వశక్తి తెలియని హనుమంతునవునీవు/ ఇప్పటికైనా కళ్ళుతెరువు/ నీను సంకెళ్ళులేవు/ నిజంగా నిజంగా నీవు స్వేచ్ఛాజీవివి/ శతవిధుల ఉజ్వలభావివి

అంటూ సామాన్యుణ్ణి ప్రబోధిస్తున్నాడు కవి. చెమ్మగిల్లిన నయనాలతో, బరువెక్కిన హృదయంతో గద్గదకంఠంతో సమాజంలోని అశాంతినీ, అవినీతినీ ప్రకటిస్తున్నాడు

"ఎడారిలో నీరుకనిపిస్తుంది/ ఎక్కడో ఒకచోట/ మానవత మాత్రం కనబడదు/ జనమున్నచోట"
అంటూ ఆవేదన వ్యక్తం చేస్తున్నాడు కవి. ఈ సంకలనం చిన్నదైనా ప్రతి కవితలో హృదయ స్పందన కనబడుతుంది

## సంజీవని

(కవితా సంకలనం)
వెల : రూ. 3 = 00
ప్రచురణ - సాహితీ సమితి
(రంగారెడ్డి జిల్లా, రచయితల సంఘం)
వికారాబాద్.

ఈనాడు తెలుగునాట రచయితల సంఘాలు, సాహితీ సంస్థలు తమ సంస్థల తమ సంమ సభ్యులైన కవులవీ, తమ ప్రాంతం వారైన కవులవీ కవితలను ఏర్చికూర్చి సంకలనాలుగా ప్రచురించడం విరివిగా జరుగుతున్నది. ఇది వర్తమాన కవులకు ప్రోత్సాహకరంగా పనిచేస్తుంది. కానీ చాలా సంకలనాలు ఉత్తమ స్థాయిలో లేకుండడం కొంత విచారాన్ని కలిగిస్తుంది. ఐనా ఈలాంటి ప్రయత్నాన్ని ప్రోత్సహించవలసిందే.

సాహితీ సమితి (రంగారెడ్డి జిల్లా రచయితల సంఘం) జరుపుకున్న జిల్లా సాహిత్య సభల సందర్భంలో ఈ కవితా సంకలనం ప్రచురించారు. ఇందులో ముప్పై ముగ్గురి కవితలు సంపుటీకరించబడినవి. ఈ సంకలనంలో వచన, గేయ, పద్య రచనలున్నాయి. కవులు అందరూ దాదాపుగా యువకులూ, సాహితీ జగత్తుకు అంతగా పరిచయంలేనివారే. కవితలు చాలావరకు సామాన్య ధోరణిలో సాగినవి. ఈ కవులు ఈనాటి యువకులందరివలెనే సామాజిక స్పృహతో రచనలు చేశారు సమాజంలోని అక్రమాలను ఎత్తి చూపారు కవితా విషయకంగా చూస్తే ఈ సంకలనంలోని రచనలు అంతగా సంతృప్తిని కలిగించవు. ఐతే అక్కడక్కడ భావోన్నతి కనబడక పోదు.

"సమతా సమతల నడుమ
సంఘర్షణ సంధ్యారాగం
కాళరాత్రిని పారద్రోలుట
బాల భానుని పట్టిచూపుట
అరుణ సంధ్యకు పరమ ధర్మం"

(సంఘర్షణ)

త్యాగం మా సందేశం
యోగం మా ఉపదేశం
అమృతం మా ఆత్మ
ఋతం మా పరమాత్మ

(ఓంకారం మా ఝుంకారం)

ఈ మొదలైన కవితలు భావోదాత్తతకు మచ్చుతునకలు. ఇంకా ఇందులో దేశంకోసం, భారత పథము మొదలైన కవితలు బాగున్నాయి.

-వేముగంటి

# ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న హిందీ ప్రచారం అందుకు సంబంధించిన సమస్యలు

(దక్షిణభారత హిందీప్రచారసభ, ఆంధ్రశాఖ పక్షాన ది. 25-6-1983 ఉదయం గం. 5-30 లకు ప్రతినిధి బృందం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులు ఎన్. టి. రామారావు గారిని వారి భవనమునందు కలసి ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న హిందీప్రచారం మరియు అందుకు సంబంధించిన సమస్యలను గురించి ఒక విజ్ఞప్తిపత్రం అందచేసింది. స్రవంతి పాఠకులకోసం ఆ విజ్ఞప్తిపత్రం ప్రకటిస్తున్నాం.)

—సంపాదకులు

---

## ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులు ఎన్. టి. రామారావుగారికి దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్రశాఖ పక్షాన సమర్పించిన విజ్ఞప్తి పత్రము

మహాత్మా గాంధిగారు 1918వ సంవత్సరములో దక్షిణభారత హిందీప్రచార సభను స్థాపించి తద్వారా దక్షిణాదికి సంబంధించిన ఆంధ్ర. తమిళనాడు, కేరళ, కర్నాటక రాష్ట్రాలలో మాతృభాషాభివృద్ధికి. జాతీయ భాష హిందీ ప్రచారానికి కృషి కావించిన విషయం మీకు విదితమే. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు దేశభక్త కొండా వెంకటప్పయ్య, డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, స్వామి సీతారాం. మోటూరి సత్యనారాయణ మొదలగాగలు దేశభక్తుల నాయకత్వాన సాగిన దక్షిణభారత హిందీ ప్రచారసభ ఎన్నో ఒడుదుడుకుల నెదుర్కొంటున్నప్పటికీ, ఇప్పటికినీ అదే మార్గాన పనిచేస్తున్నదని మనవి చేస్తున్నాము

ఆంధ్ర ప్రదేశ్‌లో ఆంధ్రశాఖ 1936లో స్థాపించబడి విజయవంతముగా పనిచేస్తున్నది. భారత స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగంగా హిందీ ప్రచారం ఆంధ్రావని నాలుగు చెరగుల వ్యాప్తి చెందినది. ప్రతి సంవత్సరము ఆంధ్ర ప్రదేశ్‌లో షుమారు 85,000 మంది పరీక్షార్థులు మా సభ పరీక్షలకు కూర్చుంటున్నారు. వీరిలో 50,000 మంది తెలుగు మహిళలని చెప్పుటకు సంతోషిస్తున్నాము. 290 హిందీ ప్రేమీ మండలులు, హైస్కూళ్ళలో పనిచేయుటకు అర్హతగల హిందీ పండితులకు శిక్షణ నాసంగు 4 హిందీ ప్రచారక విద్యాలయములు, 4 హిందీ మహావిద్యాలయములు. 21 హిందీ విశారద విద్యాలయాలు, 50 సభ మాన్యత పొందిన హిందీ విద్యాలయాలు, ఒక ఉపాధ్యాయుడు పనిచేయు 700 హిందీ తరగతులు ఆంధ్రప్రదేశ్ యందు అంతట విజయ వంతంగా సభ ఆధ్వర్యాన నడుస్తున్నవని మనవి చేయుచున్నాము.

సభ పక్షాన నడచు పరీక్షలలో మాతృభాష అనివార్య విషయము. తెలుగులో కూడా ఉత్తీర్ణులైన తరువాతనే హిందీ సర్టిఫికెట్లు సభ పక్షాన పరీక్షార్థు

లకు యివ్వడం జరుగుచున్నది. తెలుగులో స్రవంతి, సాహిత్య మాసపత్రిక నడుపుతూ యున్నాము. తెలుగు సాహిత్య గ్రంథాలు హిందీలో ప్రచురించుట సభ ప్రధాన కార్యక్రమాలలో ముఖ్యమైనది. ఆంధ్రప్రదేశ్ యందంతట సభ పక్షాన శిక్షణపొంది తగు అర్హతలు సంపాదించుకొన్న 10,000 హిందీ ప్రచారకులు మిషనరీ స్పిరిట్‌తో యిప్పుడు కూడా పనిచేస్తున్నారని చెప్పుటకు ఆనందిస్తున్నాము. హైదరాబాదులోను, విజయవాడలోను, సభకు సొంత భవనములు, ప్రెస్సు కలవు. మొదటినుండి రాజకీయ పార్టీల జోలికి పోకుండగా బాపూజీ బోధించిన నిర్మాణ కార్యక్రమాలకు సంబంధించిన మాతృభాషాభివృద్ధి జాతీయభాషా ప్రచార రంగంలో మా సభ పనిచేస్తున్నది.

1964లో స్వతంత్ర భారత పార్లమెంటు ప్రత్యేకించి బిల్లు పాసుచేసి తద్వారా దక్షిణ భారత హిందీ ప్రచార సభను జాతీయ సంస్థగా అనగా నేషనల్ ఇంపార్టెన్స్‌గల సంస్థగా గుర్తించి గౌరవించినది. సభ పక్షాన నడుచు పరీక్షలకు, డిగ్రీలకు కేంద్ర ప్రభుత్వము, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము మాన్యతనొసంగి ఆదరిస్తూ యున్నవి. కీ॥ శే॥ లాల్‌బహదూర్ శాస్త్రిగారు సభ అధ్యక్షులుగాను, భారత ప్రధానిగాను ఉన్నప్పుడు ఎం. ఏ, ఎం. ఫిల్., పి. హెచ్. డి, డిగ్రీల నొసంగుటకు, శిక్షణ నొసంగుటకు సభకు అవకాశం, అధికారం కల్పించినారు. హైదరాబాద్‌లో కూడా ఆ శిక్షణ సంస్థకు శాఖ ఏర్పాటు చేసి తెలుగు మాతృభాషగా కలిగిన మన వాళ్ళకు హిందీలో ఎం. ఏ., ఎం. ఫిల్. శిక్షణ నొసంగుటకు ఏర్పాట్లు జరిగినవి. ఈ కోర్సులో హిందీ సాహిత్యముతో పాటు సెక్రటేరియట్, బ్యాంకులు మొదలు గాగల చోట్ల పనిచేయుటకు కూడా ప్రత్యేక బోధనకు అవసరమైన పాఠ్యక్రమము యూనివర్సిటీగ్రాంట్సు కమిటీ, కేంద్ర ప్రభుత్వం వారి సహకారంతో ఏర్పాటుచేయనైనది. యిక్కడ శిక్షణ పొందిన ఎం. ఏ.లకు అఖిలభారత స్థాయిలో పెద్ద ఉద్యోగాలు లభిస్తున్నాయని చెప్పుటకు సంతోషిస్తున్నాము.

హైదరాబాదులోగల పి. జి. కాంప్లెక్సుకు గత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రారంభఏర్పాటు నిమిత్తం 5 లక్షల రూపాయలు గ్రాంటుగా యిచ్చి సహకరించినది. భవన నిర్మాణం కోసం చోటు యిచ్చుటకు వాగ్దానము లభించినది. అందుకు ప్రయత్నిస్తున్నాము.

గాంధీజీ సూచించిన విధానాలకు యిప్పటి కాలమాన పరిస్థితుల ననుసరించి స్వరూపం కల్పిస్తూనూ, తెలుగుదేశాన్ని ఆదర్శవంతంగా తీర్చి దిద్దుటకు నిస్వార్థంగా అహర్నిశం కృషి చేస్తున్న మీకు ఈ సందర్భాన క్రింద తెలిపిన విషయాలు మనవి చేస్తున్నాము.

1. ప్రప్రథమంగా భారతావనికి త్రిభాషా సూత్రాన్ని అందించిన గౌరవం ఆంధ్రప్రదేశ్‌కు దక్కినది. మన బిడ్డల జీవితంలో భాషలు నేర్చుకొనుటకు ఒకటవ తరగతినుంచి 10వ తరగతి వరకు అనుకూలమైనది. 5వ తరగతి వరకు మాతృభాష తెలుగును బోధించవలెను. 6వ తరగతినుంచి తెలుగుతోపాటు హిందీ ఇంగ్లీషు భాషలను బోధించవలెను. దీని వలన బాల్యమునందే తెలుగు బిడ్డలకు తెలుగుగాక మరో రెండు భాషలతో పరిచయం ఏర్పడును. వారి భవిష్య జీవితానికి ఎంతగానో వుపయోగపడును. ఈ త్రిభాషా సూత్రమును కొనసాగిస్తూ యున్నందులకు మీకు ధన్యవాదాలు.

2. ఈ మధ్యన భాషా బోధనకు స్కూళ్ళలో పీరియడ్లు తగ్గించి వేసినారు. వారానికి మూడు పీరియడ్లు మాత్రమే హిందీకి యిస్తున్నారు. గతంలో నాల్గు యుండేవి. ఆ విధంగా భాషా బోధనకు తగ్గించబడిన సమయాన్ని సరిచేయించ గోరుచున్నాము.

3. హిందీ భాషను అనివార్యం చేసి పాస్‌మార్కులు 20 లేక 25 ఉంచినారు. అయినప్పటికిని ఈ నాటి వరకు ఆంధ్రకు చెందిన షుమారు 2,000 స్కూళ్ళలో హిందీపండితుల నియామకమే

జరుగలేదు. హిందీ ఉపాధ్యాయుల నియామకమునకు కేంద్ర ప్రభుత్వం సగం ధనం ఆంధ్రప్రభుత్వానికి గ్రాంటుగా యిచ్చును. యీ విషయమై శ్రద్ధవహించిన హిందీభాషా బోధనకు మంచి అవకాశం కలుగును. ఉపాధ్యాయులే లేకుండగా జరుగుతున్న పద్ధతి మంచిది కాదని మనవి చేస్తున్నాము.

4. దక్షిణభారత హిందీప్రచార సభ, ఆంధ్ర ఆధ్వర్యాన ఆంధ్రప్రదేశ్‌యందంతట ఉచిత హిందీ తరగతులు నడుపబడు చున్నవి. సేవా భావముతో అనేకమంది హిందీ పండితులు సభ పక్షాన తరగతులు నడుపుతున్నారు. ఈ క్లాసులు నడుపుతున్న వారిలో జిల్లా పరిషత్తులలో పని చేయు హిందీ పండితులు కూడా కొంతమంది యున్నారు ప్రారంభం నుండి స్కూలు పనులకు ఆటంకము కలుగని పద్ధతిన స్కూళ్ళలో క్లాసులు నడుపు కొనుటకు ఆంధ్ర సభకు ఆంధ్ర ప్రభుత్వ అనుమతి కలదు. ఇటీవల ఆంధ్ర ప్రభుత్వం వారు జారీచేసిన ట్యూషన్ నిషేధపు ఉత్తర్వు మాక్లాసులు నడుపు హిందీ ఉపాధ్యాయులకు వర్తించకుండా అనుమతి కోసం ప్రార్థిస్తున్నాము. వాస్తవానికి మా సభ పక్షాన నడుపు ఉచిత హిందీ తరగతులు ట్యూషన్లు కావు. యీ విషయం విద్యాశాఖామాత్యుల దృష్టికి కూడా తీసికొని వచ్చినాము.

5 శ్రీ జలగం వెంగళరావు గారు ముఖ్యమంత్రి గాను. శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు విద్యాశాకామాత్యులు గాను ఉన్నప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌లో జాతీయ భాషా బోధనను గురించిన సమస్యలను పరిష్కరించుటకు విద్యాశాఖామాత్యుల అధ్యక్షతన ఒక హిందీ సలాహ్ కార్ సమితి నియమింపబడి పనిచేయు చుండెడిది. ఆ సమితి నియామకం వలన హిందీ పేరట జరిగే అనేక విషయాలపై చర్చ జరిపి నిర్ణయాలు గైకొనేవారు. దానివలన ఎంతో ప్రయోజనం కలిగెడిది ఆ తర్వాత ఆ సమితిని పిలువడం గాని, పునరుద్ధరణ జరుపడం గాని జరుగలేదు. ఆ సమితిని పునరుద్ధరించ కోరుచున్నాము.

6. ఆంధ్ర ప్రభుత్వ విద్యాశాఖవారు సంవత్సరానికి 15 వేల రూపాయలు మాత్రం మాన్యతా ప్రాప్త విద్యాలయాలకు గాను గ్రాంటుగా యిస్తున్నారు. ఆ సొమ్మును గౌరవంగా స్వీకరిస్తున్నాము. మా ఆంధ్ర సభ సాలు సరి బడ్జెట్టు 30 లక్షల రూపాయలు. ఈ విషయం మీ దృష్టికి తీసుకొని వస్తున్నాము. మా విజ్ఞప్తిని ఎంతో ఓపికతో విన్నందుకు సభపక్షాన కృతజ్ఞతలు.

ఇట్లు
శీర్లబ్రహ్మయ్య

శ్రీ శీర్ల బ్రి॥
అధ్యక్షులు, ద. భా. హిం. ప్ర. సభ, ఆంధ్ర.

శ్రీ ఎం. పి. పాపన్న గుప్త,
ఉపాధ్యక్షుడు, ద.భా.హిం.ప్ర.సభ. ఆంధ్ర.

శ్రీ వేమూరి ఆంజనేయశర్మ.
ఉపాధ్యక్షులు, ద.భా.హిం.ప్ర.సభ, ఆంధ్ర.

శ్రీ లోకర్సీలాల్ కపాడియా,
కోశాధ్యక్షులు, ద.భా.హిం.ప్ర.సభ, ఆంధ్ర.

శ్రీ రాధాకృష్ణ జోషీ,
మేనేజింగ్ ట్రస్టీ, ద.భా.హిం.ప్ర.సభ, ఆంధ్ర.

శ్రీ బోయపాటి నాగేశ్వరరావు,
సభ్యులు, కార్య నిర్వాహకవర్గం.
ద.భా.హిం.ప్ర.సభ, ఆంధ్ర.
అధ్యక్షులు. ఆం.ప్ర.హిందీ ప్రచారక మండలి.

శ్రీ వే॥ రాధాకృష్ణమూర్తి.
విశేషాధికారి, ద.భా.హిం.ప్ర.సభ, ఆంధ్ర.

# వార్తా వాహిని

## హిందీప్రచారక విద్యాలయ సత్రాంతోత్సవం

ది. 12-5-83న హిందీ ప్రచారక విద్యాలయ ప్రశిక్షణార్థుల వీడ్కోలు ఉత్సవం, దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర ప్రత్యేకాధికారి శ్రీ వేమూరి రాధా కృష్ణమూర్తిగారి అధ్యక్షతన జరిగినది ప్రచారక విద్యార్థినులు ప్రార్థన గీతం ఆలపించారు

ప్రచారక విద్యాలయ స్థాపకులు వ్యవస్థాపకులు శ్రీ బోయపాటి నాగేశ్వర రావుగారు అతిథులకు స్వాగతం పలికి వారిని సభికులకు పరిచయం చేశారు. ప్రిన్సిపాల్ కుమారి కె. సీతగారు తమ నివేదిక 12 జిల్లాలనుంచి వచ్చిన 11 మంది పురుషులు, 44 మంది స్త్రీలు ప్రచారక ప్రశిక్షణ పొందినట్లు వివరించారు.

సభను ప్రారంభిస్తూ శాసన సభ్యురాలు శ్రీమతి నన్నపనేని రాజకుమారి- పూజ్యబాపూజీ అడుగుపెట్టిన యీ ప్రదేశంలో క్రమశిక్షణతో హిందీభాషా ప్రచారం జరగడం చాలా సంతోషం అన్నారు పలు ప్రాంతాలు భాషలు గల మనదేశంలో పరస్పర సాన్నిహిత్యం కొరకు హిందీభాషా ప్రాముఖ్యాన్ని వారు నొక్కి చెప్పారు. అత్యధిక సంఖ్యలో "అమ్మాయిలు" హిందీని అభ్యసిస్తూ క్రమశిక్షణతో మెలగుచున్నందుకు, అభినందించారు.

తెనాలి పురపాలక్ససంఘాధ్యక్షులు డా॥ రావి రవీంద్రనాథ్ ప్రసంగిస్తూ- గాంధీజీ నిర్మాణ కార్యక్రమాల్లో హిందీ ప్రచారం ఒకటి, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జాతీయ భాషగా హిందీ ప్రభుత్వ పరంగా నిర్ణయం చేయబడ్డది. ఇది నిర్వివాదం. సువిశాలమైన విభిన్న భాగాలు గల మన దేశానికి తప్పని సరిగా జాతీయభాష అవసరం. దేశ సమగ్రతకు, మారుతున్న పరిస్థితుల దృష్ట్యా హిందీభాషా ప్రాముఖ్యాన్ని గుర్తించాలని గుర్తిస్తారని తమ అభిప్రాయం వెల్లడించారు.

స్వాతంత్ర్య సమరయోధులు, ప్రేమీమండలి అధ్యక్షులు శ్రీ వెలువోలు సీతారామయ్యగారు, గాంధీజీ అడుగుజాడల్లో శిక్షణార్థులు క్రమశిక్షణతో సేవాభావం అలవరచుకొని, జాతీయభాషా ప్రచారం గావించాలని ఆశీర్వదించారు.

వరిష్ఠ హిందీ పండితులు శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు నేటి ఉపాధ్యాయులపై రేపటి పౌరులను తీర్చిదిద్దవలసిన బాధ్యత కలదని పేర్కొని ప్రశిక్షణార్థులు తమవృత్తిని సరిగా నిర్వర్తించటం ద్వారా ఆదర్శ పౌరులను తీర్చిదిద్ద వలెనని హితవు పలికారు.

అధ్యక్షులు శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగారు నేటి దేశస్థితిని సమీక్షిస్తూ- మనం గాంధీజీని మరచిపోయి ఇటీవల విడుదలైనవారి ఫిల్మ్ చూసిన తరువాత మహాత్మాగాంధీ" అనే దశకు చేరుకొన్నామని తమ ఆవేదన వెల్లడించారు. దేశంలో నైతిక విలువలు నశించినా, గాంధీ టాండన్ ప్రభృతుల కారణంగా అవి ఉద్దీప్తములై ప్రకాశించుచున్నవని అన్నారు. హిందీ ప్రచారం గురించి ముచ్చటించి. దక్షిణాదిలో అత్యధికంగా మహిళలు హిందీ నేర్చుకుంటున్నారని, ముఖ్యంగా తమిళనాడులో అధికార్లదే ముందంజ అని తెలిపి సభికులను ఆశ్చర్య పరిచారు. కేంద్ర ప్రభుత్వ విధానం గురించి పేర్కొని. హిందీభాషా ప్రచారార్థం ఆర్థికంగా తగినంత ప్రోత్సాహం లభించుటలేదని అన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం త్రిభాషాసూత్రాన్ని అంగీకరించడంపట్ల తమ హర్షం ప్రకటించారు. నేటి యువకులు ఉత్తమ ఆదర్శాలను అలవరచుకొని ముందుకు సాగాలని అభిలాషించారు.

శ్రీ ఎన్. సత్యనారాయణాచార్యులు ధన్యవాదములు తెలిపారు.



హిందీ ప్రచారక విద్యాలయ వార్షికోత్సవ సందర్భంగా తెనాలిలో జరిగిన సభలో శ్రీమతి నన్నపనేని రాజకుమారి ఎం. ఎల్. ఏ. గారు జాతీయ భాషా ప్రచారాన్ని సమర్థిస్తూ ప్రసంగిస్తున్న దృశ్యం.

కుర్చీలలో తెనాలి మున్సిపాలిటీ ఛైర్మన్ శ్రీ రావి రవీంద్రనాథ్,
వేమూరి రాధాకృష్ణ మూర్తి, హిందీ పండితులు జనస్వామి
సుబ్రహ్మణ్య శాస్త్రి, తెనాలి హిందీ ప్రేమీ
మండలి కార్యదర్శి శ్రీ బోయపాటి
నాగేశ్వరరావు గారలు
గలరు.



దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖ పక్షాన ప్రతినిధి బృందం ది. 26.6.1983 ఉదయం ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ ఎన్. టి రామారావుగారిని కలుసుకొని ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న హిందీ ప్రచారాన్ని గురించి విజ్ఞప్తిపత్రం సమర్పించినప్పుడు తీయబడిన ఛాయాచిత్రం-ఇందు శ్రీయు॥ శంకరశాస్త్రి, రాధాకృష్ణ జోషీ, గోదా తిరుమలయ్య, తంగిరాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గౌ॥ ఎన్. టి. రామారావు, శీర్ల బ్రహ్మయ్య, టోకర్సీలాల్ కాపడియా, రాధాకృష్ణమూర్తి, వి. కమలాకర్ గారలుగలరు.

**Edited, Printed and Published** by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
**and Printed at** Dakshina Bharat Press, Hyderabad-500 004.